. # జపాను చెరిత్ర క్లుప్తంగా

సేకరణ వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ
అమరావతి

**Vol- I.**



జపాన్ చరిత్ర -క్లుప్తంగా [1}




ఇవాళ మనము ఉద్యోగాలు వెతుక్కుంటూ ఎక్కడెక్క డికో పోయినట్లు - మొదటి తరం మానవులు మంచి తిండి వెతుక్కుంటూ - ఎక్కడెక్కడికో పోయే వారు . మంచి తిండి అంటే పళ్ళు చేపలు వేట మాంసము అని . మనము

ఉద్యోగము దొరికిన చోట నే ఇల్లు పెతుక్కున్నట్లు - వీరు ఆహారం దొరికిన చోటనే కొండగుహను / నివాసాలను పెతుక్కునే వారు. గుహ దొరక్క పోతే అక్కడనుండి మకాము ఎత్తి పెళ్లి పోతూ వుండే వారు .

ఒక గుహలో లభించిన అస్థికలను బట్టి , నేటి జపాన్ వారి భూభాగాము అయిన ఒకినావా లో –39,000 సంవత్సరాల క్రితము మొదటి సారిగా కొందరు మనుషులు నివసించారు . ఈ గుహల్లోనే బాగా పదును పెట్టబడిన రాతి గొడ్డళ్లు , మట్టి కుండలు దొరికాయి . . వీరు చెట్ల నారనితీసి , పేని , నులక తాళ్లు కూడా చేశారు .అప్పటికి ఇదే గొప్ప అభివృద్ధి . ఈ నులకని జామున్ అంటారు . కొండగుహల్లోని జనం తాము చేసిన మట్టి కుండలు పచ్చిగా వున్నపుడే దాని మీద ఈ జామూన్ ని పెట్టి నొక్కి -కుండకు అందాల డిజైన్లు తెప్పించారు. అందముగా సృష్టి చేయటం అనే విద్య దేముని నుండి మనిషి తీసుకున్నట్లు అయ్యింది . కుండ మీద నులకతాడు డిజైన్ ను బట్టి ఈ జనానికి నులక తాడు/జామూన్ ని చేసే తెలివి అబ్బిందని మనకు నిరూపణ అయ్యింది . జామూన్ ని తయారు చేసి దాని సాయంతో కుండల మీద డిజైన్ లు అద్ది ఒక గొప్ప తెలివిని కనపర్చిన ఈ తెగ వారిని- వేరే తెగల వారు-- జామూనీయులు -అన్నారు .

వీరుండే ప్రాంతము జామున్ అయింది , అదే క్రమంగా జపాన్ గా  ఉచ్చరించబడింది .

 ఆహారము మరియూ సుఖ జీవనానికి కావాల్సిన వాటి కోసం అని  అన్వేషణలో  పడి ఇక్కడి   జనం  ఎక్కడెక్కడికో పోతూ వుంటారు . ఎక్కడెక్కడో వుండే  జనం  ఇక్కడికి వస్తూ వుంటారు . ఇదియే  మానవుల వలస విధానము / కారణము  . ఈ కారణం చేతనే నేడు మనము ఉద్యోగాలకోసం విదేశాలకు పోతూ వున్నాము  .

పైన చెప్పిన వలస విధానము కారణంగా , Yayoi అనే తెగకు చెందిన జనం   ఈ జామూన్ తెగ జనం వున్న ప్రాంతం లోకి ప్రవేశించి  మకాములు పెట్టుకున్నారు. .ఇది 3rd century BC,ప్రాంతం లో జరిగింది . Yayoi  తెగ వారికి  ఆ పాటికే వ్యవసాయము -  తెలుసు . వ్యవసాయము చేతిలో ఉంటే ఆహారము వెతుక్కుంటూ ఎక్కడికి వెళ్ళ వలసిన పని లేదు కదా ? అందువల్ల  Yayoi తెగ వారు  ఉన్న చోటనే ఉంటూ సంఖ్యా పరంగా జామూన్లని  అతి వేగంగా దాటి పోయారు . Yayoi  జనం పెరిగి న కొద్దీ , వారు వ్యవసాయ భూమి కోసము అని వెతుక్కుంటూ వేరు వేరు ప్రాంతాలకి చొచ్చుకు  వెళ్లి , అక్కడ వేరు వేరు ఉప తెగలుగా మారారు . ఇది సహజం .

కానీ వీరు తమ యొక్క మూల ఆచారాలను పాటిస్తున్నారా ? లేదా అని కొందరు పెద్దలకు సందేహము వచ్చింది . తమ మత ఆచారాలకు ఎటువంటి భంగము కలగకుండా కాపాడుకోవాలనే కోర్కె ఉన్నవారు అప్పుడూ - ఇప్పుడూ ఎప్పుడూ కూడా వుంటారు . వీరు మత నాయకులు అవుతారు . ఉప తెగలుగా ఏర్పడిన వారు తమ మూల తెగలోని ఆచారాలను పాటించటం లేదు తమ సొంత ఆచారాలను ఏర్పరుచు కుంటున్నారు . అంటే స్వతంత్రంగా వ్యవహరిస్తూ వున్నారు అని . ఒక ఉప తెగ చేత దాని యొక్క మూల తెగ యొక్క ఆచారాలనుపాటింప చేయటం కోసం అని బలముగల నాయకుడు అవసరం అయ్యాడు . అలాగా ఒక నాయకుడు / రాజు పుట్టాడు . అనేక ఉప తెగల వారిని నయానో భయానో ఒప్పించి తాను చెప్పిన ఆచారాలు వ్యవహారాలూ పాటించేట్లు చూడటం నాయకుని / రాజు భాద్యత / జాబ్ అయ్యింది . జాబ్ చేయటంలో భాగంగా, రాజులు ఉప తెగల మీద యుద్ధాలు మొదలెట్టారు .

అనేక తెగలుగా మారుతూ , స్వతంత్రంగా వ్యవహరిస్తున్న తెగలన్నింటినీ కలిపి ఒక రాజు చేత అదుపు చేయించటం కన్నా - అన్ని తేగలకూ సరి పోయేట్లు ఒక దేముడిని సృష్టించి - ఆ దేముని ద్వారా నే తెగ ఆచారాలను చెప్పించి

వాటిని ప్రజలు పాటించేటట్లు చేయటం మరింత సులువేమో అని మత పెద్దలు అనుకున్నారు . ఇలా ప్రతి మతానికీ కూడా, ఒక దేముడు, ఆ దేముడు పుట్టిన భూమి మరియూ అతడు గడిపిన జీవితము - అతడు చెప్పిన భోదలు కలిగి ఉండటం ప్రారంభము అయ్యింది .

పై దృష్టితో - - అనేక దేవతా కధలు పుట్టాయి .వాటి ప్రకారం -- ఒక దేముడు ఒక దేవతా కలిసి ఒక జంటగా ఏర్పడి - ఆకాశంలో నిలబడి - కుండలోని పాలని చిలికి నట్లు, భూమి అనే కుండ లోపలి పదార్ధాన్ని చిలికారు . ఆలా చిలకగా - వెన్నలాంటి స్వర్గము బయటికి వచ్చింది. .ఆ స్వర్గమే జపాను కు దక్కిన భూమి అయ్యింది . జపనీయులు స్వర్గం పైన వున్నది అనకుండా దాన్ని భూమి మీదకు దింపారు . అందువల్లనే, జపనీయులు గొప్ప సౌందర్య ధ్రుష్టి కలిగి , తాము చేస్తున్న ప్రతి పనీ - స్వర్గానికి ఒక అందము చేకూర్చటానికి గానూ చేస్తున్నట్లు భావించి చేస్తూ వుంటారు .

జపాను అనేక దీవుల సమూహము కదా ? నేడు జపానుకు 14,125 ద్వీపాలు వున్నాయి .ఈ ద్వీపాలు నేటికీ కూడా సంఖ్యలో పెరుగుతూ నే వున్నాయి . భూమి లోని పదార్ధాన్ని చిలుకుతూ ఉండగా -- అసలు కుండలో ని

పదార్ధం  సరిగా తయారుఅవుతోందా లేదా? అని దేవతకి సందేహం వచ్చి,  కుండలోని పదార్ధాన్ని ఒక చెక్క గంటెతో బయటికి తీసి చూసింది . అప్పుడు ఆ గంటె లోనుండి జారి పడిన పదార్ధ బిందువులే జపాన్ ద్వీపాలు అయ్యాయి. దీనిని పట్టి జపాన్   పూర్వీకులు    భూమి గుండ్రంగా వున్నది అనకపోయినా కుండవలె వున్నది అని ఊహించ గలిగారు అని తెలుస్తున్నది ..  భూమి గుండ్రముగా వున్నదని నిరూపణ కావటానికి చాలా కాలము ముందు గానే వారు భూమి ఆకారము గురించి దరి దాపుగా ఊహింప గలిగారు . అట్లాగే ద్వీపాలు అనేవి సరిగా ఏర్పడని భూభాగాలు అని కూడా తెలుసుకున్నారు . భూమిని గురించి జాపనీస్ పూర్వీకులు   చేసిన ఆలోచనలు వారికి గల   తెలివితేటలను వెల్లడి చేస్తాయి .  జపాను దేశము, చాలాకాలం పాటు ఇతర ప్రపంచ దేశాలతో స్నేహ సంభందాలు పెట్టుకోకుండా ఒంటరిగా గడిపింది . తన సంస్కృతి సంప్రదాయాలు కలుషితం కారాదన్న ఆలోచనతో జపాన్ ఆలా చేసింది . జపాను – పశ్చాత్త్యా దేశాలను దూరంగా పెట్టటం వలన వీరి తెలివికి ప్రాచుర్యం దక్కలేదు .

భూమిని చిలికిన దేవీ దేవతలే భూమికి కావాల్సిన సంతానాన్నికూడా  కన్నారు . ఒక పక్షి జంట పిల్లలని కనటానికి ముందే  - గూడు కట్టినట్లు , దేవతలు ముందుగా

భూమిని ఏర్పరిచి దానిలో తమ సంతానాన్ని పెట్టారు. అనగా ప్రకృతి తాను చేసే ప్రతి పనిని మానవజాతి కోసమే చేస్తుంది అని , అందువల్ల జపనీయులు ప్రకృతిని రక్షింపటానికి అధిక ప్రాధాన్యం ఇస్తారు .ఈ ప్రకృతి ఆరాధనే క్రమంగా షింటో మతము గా మారింది



జపనీయుల సౌందర్య ద్రుష్టి కి ఉదాహరణం . ఒక దున్న పోతుల బండిని అందంగా మార్చారు .బండిని ప్రదర్శించటం లో కూడా గొప్ప కళా ద్రుష్టి చూపి ప్రకృతికి అదనపు అందం చేకూర్చారు



జామూన్ జాతి వారు రూపొందించుకున్న దేవత కావొచ్చును . ఇది ఏమిటో దానికి అంత పెద్ద కన్నులు ఎందుకు ఉన్నవో ఎవరూ గ్రహింప లేకపోయారు

జపాను చెరిత్ర క్లుప్తంగా -{2}  27-03-24

ప్రజలు భిన్న ఆచారాలు, అభిప్రాయలు ,  అలవాట్లు ఏర్పరుచుకుంటున్నపుడు - దేముని పేరు మీద వారిని అందరీనీ ఒకే దారికి తెచ్చి,  అందరూ కూడా ఒకే ఆచారాన్ని సంప్రదాయాన్ని  పాటించేట్లు చేయగలిగారు . దీనితో -  ప్రజలను బలవంతపెట్టి అయినా సరే ,  వారు వారి యొక్క  తెగ  మూలాచారాలను పాటించేటట్లు చూడవల్సిన  భాద్యత రాజులకు లేకుండా పోయింది .

దీనితో  రాజులు విశ్రాంతికి దిగి హోదా కోసం  రాజ మహాళ్ళు కట్టుకోవటం - తాము పాలించే ప్రాంతాల అభివృద్ధి చేసుకోవటం  మీద ద్రుష్టి పెట్టా రు . జపాను లోని  "షోగన్" లు మన రాజులు లేదా జమీందారుల లాంటి వారు .  ఈ షోగన్ ల మీద అధిపతిగా   "ఎంపరర్ అఫ్ జపాన్"  ఉంటాడు  . జపాను చక్రవర్తి నేరుగా సూర్యునికి జన్మించిన వాడు , అని జపాను వారి నమ్మకము . ఈ  పదవి వంశపారం పర్యంగా దక్కే పదవి . అంటే మిగతా రాజుల మీద యుద్ధము చేసి  విజయం సాధించి దక్కించున్న పదవి కాదు . కేవలం  అలంకార ప్రాయమైన  పదవి .చేతిలో అధికారము ఉండదు సంపదా ఉండదు .  జపాను వారికి,  వారి చెక్రవర్తి ఎక్కడ నివాసం ఉంటే అదే వారి ముఖ్య పట్టణము గా వుండే ఆచారము వుంది . ఈ పద్ధతిని కాదు అని   Emperor Kammu అనే అయన 794 AD  లో   Kyoto ని రాజధానిగా నిర్ణయించి అక్కడ  నే స్థిరపడ్డాడు . అందువల్ల జపాను  కు,  టోక్యో కన్నా ముందు రాజధాని క్యోటో .   **Tokugawa Ieyasu**  అనే షోగన్  మొదటిగా టోక్యో నుండి పరిపాలన ప్రారంభించాడు . టోక్యో మొదటలో  "ఏడో

"అనే పల్లెటూరు.   Tokugawa వంశస్థులు ఈ "ఏడో" గ్రామాన్ని అభివృద్ధి పరిచి సుస్థిర పాలన స్థాపించారు . వీరి పరిపాలన కాలాన్ని "ఏడో పీరియడ్" అంటారు. Tokugawa Shogunate వంశస్థులు జపానును 1603 నుండి 1868 వరకూ పాలించారు . వీరి అనంతరమే    జపాన్ చక్రవర్తి యొక్క  ప్రభావం జపాను దేశ వ్యవహారాల మీద వుంటూ వచ్చింది  . జపానును బాగా ప్రభావితం చేసిన చక్రవర్తి "మెజీ "చక్రవర్తి . అయన కాలాన్ని మేజి పీరియడ్ అంటారు   చక్రవర్తులు తమ ఆధిక్యం  రుజువు పరుచుకోవటానికి అని , టోక్యోలో ఉన్న Tokugawa Shogunate  నుండి ధనము రాబట్టి   - , క్యోటో పట్టణాన్ని కట్టి, దాన్ని తమ రాజధానిగా చేసుకున్నాఋ   .ఈ పరంపరలో  794 to 1185  కాలాన్ని Heian period అంటాఋ . వీరి కాలములో జపాను లోని అనేక తెగలు ఒక్కటిగా కలిసిపోయాయి .  ఇదే సమయములో జపానులో రొండు మతాలు అమలులోకి వచ్చాయి . మొదటిది Shinto మతము .రొండొది బుద్ధిజం.

ఒరిజినల్ గా జపాన్లో పుట్టిన  ప్రముఖ మతము - షింటో మతము , షింటో మతము  అంటే ప్రకృతిలో వున్న ఎదో

నియమాన్ని/ విషయాన్ని - నిత్య జీవితంలో పాటించవలసిన నియమంగా మార్చుకునే జనులు ఉన్న మతము అని అర్ధము . ప్రకృతి నియమాలను నిజ జీవితంలో ఆచరించి అమలు పరిచే వారిని షింటోలు అని పిలుస్తారు . కానీ ఈ నియమాలను ఆచరించే జనము తమను తాము షింటోలుగా పిలుచుకోరు .అంటే తాము ఒక మతానికి చెందిన వారీగా చెప్పుకోరు . అందువల్ల నే జపనీయులు బుద్ధిజానికి వేగంగా స్వాగతం చెప్పగలిగారు . తముకు అంటూ సొంత మతము వున్నవారు ఇంకొకరి మతాన్ని అంత త్వరగా ఆదరించరు కదా ? ప్రకృతి నియమాలను, విషయాలను గ్రహించటం అనేది ఒక నాటితో పూర్తి అయ్యేది కాదు కనుక నూ - ఒకచోటి ప్రకృతికి ఇంకోచోట ప్రకృతికి తేడా ఉంటుంది కనుక నూ - ఈ షింటో నాలెడ్జి కి అంతము ఉండదు . ఎప్పుడూ నేర్చుకుంటూ ఉండవలసిందే .ఈ మత ప్రభావం వల్లనో ఏమో ? జపనీయులు , ఎప్పుడూ , ఎప్పటికీ , నేర్చుకుంటూ నే వుంటారు . షింటోలకు - మత పెద్ద గానీ గురువు కానీ ఉండడు. అందువల్ల జపాను చక్రవర్తియే వీరికి మత పెద్ద గా , గురువుగా చెలామణీ

అవుతాడు . చెక్రవర్తి అనే వాడు ఎప్పుడూ ఉన్నతమైన, అద్భుతమైన, అందమైన , ఆనంద ప్రదాయిని అయిన, అసాధ్యము అనిపించే వస్తువుని మాత్రమే కోరుతాడు కదా ?. ఆ వస్తువుని తయారు చేయటం ఎట్లాగా? అంటే ? ప్రకృతి చూసి నేర్చుకోవాల్సిందే గదా ? ఉన్నతమైన కోరికలు కోరుతూ తమచే నిరంతరము ఆలోచింపచేసే ది చక్రవర్తి ఏ కాబట్టి , షింటో మతము జపాను చక్రవర్తిని తమ మత పెద్ద లేదా గురువుగా స్వీకరించింది . షింటో టెంపుల్ కి వెళ్లే ప్రెవేశ ద్వారాల రూపం వేరేగా ఉంటుంది . దీన్ని Torii అంటారు . మన గుడులకు ధ్వజస్తంభము లాగా ఇది షింటో మందిరాలకు బండ గుర్తు . జపాను షింటో మతము అంతా "కామి" అనేదాని చుట్టూ తిరుగుతుంది .మనుషులు చనిపోయాక , " కామీ" లు అవుతారు . మంచి మనుషుల ఆత్మలు ప్రకృతి చూపే అందములోనూ , ప్రకృతి చూపే కరుణ లోనూ కలిసి పోయి మనుషులకు మేలు చేస్తాయి ---,ఆ తరువాత దేవతలు గా మారుతాయి , చెడు చేసిన కామీలు , ప్రకృతి చేసే విలయం లోనూ విధ్వంసం లోనూ కలసి పోతాయి . ఈ చెడు కామీలు దయ్యాలు లేదా దేముని పట్ల విలన్

గా మారుతాయి . మనుషులకు కష్టాలు ఇస్తాయి . ఉదాహరణకు - విద్యార్థులకు చక్కగా పాఠం చెప్పి సమాజ ఉన్నతికి కారకులైన ఒక టీచర్ వున్నాడు అనుకోండి . ఆయన కామీ పెళ్లి దైవ శక్తులలో కలుస్తుంది . అప్పుడు దైవానికి ఈ వ్యక్తి పోలికలు వస్తవి . అందదు వల్ల, దేముని విగ్రహం బదులు ఒక వ్యక్తి విగ్రహం పెట్టి కూడా దైవ - మందిరము కట్టుకోవచ్చు . అందువల్ల- మంచి వారని ప్రజల గుర్తింపు పొందిన వారి అందరికీ దేముళ్ళ కున్నట్లుగానే షింటో మందిరాలు ఉంటాయి . వ్యక్తులను దేముళ్ళగా మార్చగల ఇలాంటి సంస్కృతి వున్నపుడు, ప్రజలు మంచి తనంతోనూ , విద్యలు కనిపెడుతూనూ , తమ జ్ఞనాన్ని ఇతరులకు భోదిస్తూనూ, ఓర్పు మరియూ శాంతము తోనూ , స్నేహం తోనూ. ఇతరులకు సేవచేసే గుణం తోనూ జీవితం కోన సాగిస్తారు అనుటలో సందేహం లేదు కదా ? ఇదే జపనీయులు జాతి మూల లక్షణంగా మారి వారి పురోగమనానికి ఒక కారణము అయ్యింది . దేవతలు అందరూ చనిపోయిన వారి ఆత్మల రూపమే .కాబట్టి ప్రతి దేముడికి వేరు వేరు ఇష్టాలు, ఇష్ట ఆహారాలు,

వేరు వేరు శక్తులు స్వభావాలు ఉంటాయి . కాబట్టి చని పోయిన వారి జీవితం గురించి తెలుసుకుని ,వారి స్వభావాన్ని పట్టి మన కోరిక అడగాలి అని షింటో మతము చెపుతుంది . ఈ రకంగా మరణించిన వారి జీవిత చెరిత్రలను గాలికి వదిలేయకుండా, వారి నుండి తరతరాలకూ స్ఫూర్తిని పొందే మార్గము నిర్మించుకున్నారు . దేవతలైన కామీలకు వాటి ఇష్టాలను బట్టి ఏ నైవేద్యాలు పెట్టాలి . దుష్ట కామీలకు మంచి ఆహారాన్ని ఇచ్చి అవి మన జోలికి రాకుండా చేసుకోవాలి . ఆహారంతో ఎవరినైనా లొంగ తీసుకోవచ్చు అనేది విశ్వ సత్యము . జపాన్ చెక్రవర్తి ఏ షింటోలకు నాయకుడు - కాబట్టి ఆయన ఏమి చేసినా గానీ చివరికి దేవతగానే, మారుతాడు . ఇట్లగా జపాను లోపెద్ద పెద్ద షింటో మందిరాలు వెలిశాయి ..ఇలాంటి జపానులోకి

షింటో మత నాయకునిగా జపాన్ చక్రవర్తి అలంకరణ రూపము

.

జపాన్ గురించి క్లుప్తంగా - {3}     28-03-24

షింటో మతము ఆచరిస్తూ వున్న   జపానులోకి , చైనా ద్వారా మహాయాన బుద్ధిజం  ప్రవేశించింది .  దీన్ని హాన్ బుద్ధిజం అంటారు .  హాన్ అనగా ప్రతి వారు అర్ధము చేసుకోగలందులకు గానూ సరళమైన  మాటలు కలిగి వున్నది అని అర్ధము .   హాన్  పండితులు  - భారత దేశమునుండి  లభిస్తూ వున్న బుద్ధుని బోధనలను తమ పుస్తకాలలో నికి  తెచ్చి వాటిని సరళీకరించి   తమ చైనా దేశపు  ఆచారాలను   జానపద కధలను కలగలిపి బౌద్ధ గ్రంధాలు రాశారు .  ఆ కధలు రాసేటపుడు  చైనీస్ పదాలతో పాటు  కొరియన్ . జపాన్ , వియత్నామీస్ భాషలకు చెందిన మాటలు కూడా విరివిగా వాడారు . అందువల్ల బుద్ధిజం కి చెందిన పుస్తకాలు అందులోని విషయాలు జపానులోకి  త్వరగా చొచ్చుకు వెళ్లాయి . ఉచ్చారణని బట్టి -   పలికే తీరుని పట్టి  వేరు వేరు అర్ధాలను ఇచ్చే మాటలను కూడా  చైనీస్ గ్రంథ కర్తలు తమ పుస్తకాలలో వాడారు ,

వి'రో'చనము అంటే కాంతి. వి'రో'చనుడు అంటే సూర్యుడు. వి'రే' చనము - అంటే కడుపు ఖాళీ కావటం - ఇలాంటి మాటలు అన్న మాట . ఇలాంటి మాటలు వినినాక ,ఈ మాటలతో బుద్ధిజం ఏమి చెపుతున్నదో? తెలుసుకోవాలి అనే ఆసక్తి ప్రజలలో పెరిగింది . ఇలాంటి మాటల వల్ల బుద్ధుని బోధనలలో ఘూడత పెరిగి - ఎవరు ఏమి ఊహించుకుంటే అది అయ్యే స్థితి వచ్చి - ఇది సామాన్యులకు కూడా అర్ధమైన / ఆమోదయోగ్యమైన మతము అయ్యింది .

బుద్ధునికి వి'రో'చనుడు అంటే సూర్యుడు . అనే రూపము వున్నది . ఇది తెలియ క ముందు నేను - విరోచనుడు అనే ఒక పేరు బుద్దినికి పెట్టారు అంటే - అయన మనలోని పాపాలను లేదా చెడు ప్రవర్తనను ప్రక్షాళన చేసి - ఒక విరోచనములా బయటికి పంపే శక్తీ వున్నదేముడు కాబోసు - అందుకే ఆపేరు పెట్టారు అనుకున్నాను . నాలాగే జపాన్ పల్లెవాసులు కూడా అనుకోని - " నేను అనుకునేది నిజం కాదేమో ? బౌద్ధ పండితులను అడిగి తెలుసుకుందాము అనుకోని , తెలుసుకోవాలి అన్న ఆసక్తి కలవారు అందరూ బౌద్ధ మతానికి ఆకర్షితులు అయ్యారని నేను అనుకుంటాను . వి'రో'చనుడు అన్న పేరున నేటికీ జపానులో బుద్ధ మందిరాలు కూడా వున్నవి .

జపాను వారు కూడా తమ నిత్య  జీవితంలో ఎదుర్కొన్న కష్టాలు , దానికి దొరికిన పరిష్కారాల ఆధారంగా కొన్ని ఆధ్యాత్మిక కధలు అల్లుకొని వాటిని జాపనీస్ బుద్ధిజంలోనికి  చొప్పించారు .

బుద్ధిజం మూడు శాఖలు గా వుంది . అందులో మొదటిది ప్రముఖమైనది - మహాయానము .

సంస్కృతపు మాట అయిన  "యానము" నకు అర్ధము 'రధము " అని . రధము  ప్రయాణానికి పనికి వచ్చు ఒక బండి  . మిమాన యానము అనగా విమానము అనే బండి ద్వారా చేసే  ప్రయాణము . నౌకా మనము అనగా నౌక అనే బండి ద్వారా చేసే  ప్రయాణము  .

భూమి ని అతి గొప్ప బండి గా భావించి,  దీనిలోకి ఎక్కినా జనులు ఎందుకు ?ఏదిక్కుకు? ఏమి ఆశించి ? ఈ ప్రయాణము చేస్తున్నారు? పునర్ జన్మల రూపంలో అనేక సార్లు చేయవలిసి వున్న  ఈ నిరర్ధక ప్రయాణాన్ని తప్పించుకోలేమా ?  అని చేర్చించేదే మహాయనము .

బుద్ధిజంలోని రెండో శాఖ Theravada  ధేరవేద  . బుద్ధుడు స్వయంగా చెప్పిన బోధనలను బుద్ధుని శిష్యులు పాళీ భాషలో  గ్రంథస్థము చేయగా   . ఈ గ్రంధాల ఆధారంగా బుద్ధిజం ని ఆచరించే వారిని ధేరవాదులు అంటారు . బుద్ధుని బోధనలు అన్నీ పాళీ భాషలోనే

రాయబడ్డాయి .   పాళీ భాష నేర్చుకుంటే దాని ద్వారా అనేక ఇతర భాషలు అర్థం అవుతాయి లేదా అనేక ఇతర భాషలు వారికీ పాళీ భాష సులువుగా అర్థం అవుతుంది .పాళీ భాషను" Lingua franca " అనే శాస్త్రీయ నామంతో పిలుస్తారు .Lingua franca అంటే రెండువేరు వేరు భాషల మధ్య బ్రిడ్జి లాంటి భాష అని అర్థము .పాళీ భాష వల్ల నే బుద్ధిజం అనేక మందికి పరిచయం అయ్యింది .

ఇక మూడవది వజ్రయానము లేదా మంత్ర యానము . యానము అనగా బండి అని మునుపే చెప్పుకున్నాము . వజ్ర యానము = వజ్రము వంటి లక్షణాలు వున్న బండి { అంటే వజ్రము వంటి దృఢసంకల్పం అనే బండి} ఎక్కి అని అర్థము -- మంత్రయానము అంటే  మంత్రాలు అనే బండి ఎక్కి అని అర్థము . అనగా మొక్కబోని వజ్ర సంకల్పంతో  - మంత్ర కర్మలు చేస్తూ, ఆచరిస్తూ , కఠిన నియమాలు పాటిస్తూ ప్రయాణించి బుద్ధుని చేరుకోవటం. దీనిలోని ఆచారాలు క్రతువులు పూజలు అన్నీ కూడా భారత దేశము నుండీ బుద్ధిజం లోకి వచ్చినవే . ఈ రకమైన వజ్ర లేదా మంత్ర యానాన్ని టిబెట్ వారు రూపొందించుకొని ఆదరించి అమలు పరుచుకున్నారు . అక్కడనుండి ఇది నేపాల్ , సిక్కిం వంటి హిమాలయన్ రాష్ట్రాలకు - మంగోలియా దేశాలకు పాకింది .

------------------------------------------------------------------
------

కొన్ని జపనీస్ సిద్ధాంతాలు ,

.పూలు అన్నీ స్త్రీల కోసం కాదు . స్త్రీలు మాత్రం పూల కోసమే . వారు వాటి అందాన్ని రెట్టింపు చేయటానికి సృష్టి చేయబడినారు .

ఎండిన మొక్క చిగిర్చేది తన శక్తీ చూపించటానికి కాదు . నీటికి ఉన్న శక్తిని వెల్లడి చేయటానికి . నీటికి ఉన్న నిరాడంబరత ఏ శక్తిని ప్రదర్శించదు . మన నిరాడంబరత మాత్రమే ఇతరులకు శక్తి ని ఇస్తుంది .

------------------------------------------------------------------




చిత్ర రూపములో మహాయనము అన్న వూహ



ప్రకృతిని  ఆరాధనీయం చేస్తూ నిర్మించ బడిన షింటో కట్టడాలు

జపాను గురించి క్లుప్తంగా {4}

ఐదు లేదా ఆరో శతాబ్దము నుండీ జపాన్ చక్రవర్తి ప్రస్తాపన ఉంటుంది . చెక్రవర్తి సూర్యుని సంతానమని - భావించి  ఆయన వారసులకు కూడా చక్రవర్తి పదవి ఇస్తారు . ఇది నేటికీ అమలులో వుంది . ఈ చెక్రవర్తులు ఎవరూ యుద్ధాలలో పాల్గొన్నది లేదు .రాజ్యాలు గెలిచింది లేదు .

జపాన్  చెక్రవర్తికి  దేశ భూమి మీద, ఆ  ప్రజల మీద ఉన్న అధికారాలను   de jure అధికారాలు అంటారు . అంటే   ఒక వ్యక్తి చేతిలోనో  రాజు చేతిలోనో  ప్రత్యక్షంగా ఏమీ భూమి గానీ ప్రజల మీద అధికారం లేకపోయినా గానీ ఆ నిజా నిజాలు పట్టించుకోకుండా భూమి- ప్రజలు అన్నీ  చక్రవర్తివె ,  అని చెప్పటాన్ని  de జ్యూరీ అధికారాలు అంటారు . చట్టం కూడా  దీనిని గుర్తిస్తుంది . చివరికి ఏమిటంటే భూమి అంతా  చెక్రవర్తిదే కానీ అయన చేతుల్లో ఏమీ భూమి  లేదు అని . కేవలం పేరుకు అయినా సరే   జపాను భూమి మొత్తము చక్రవర్తిదే కాబట్టి వారి లోకి కొన్ని రాజరిక లేదా భూస్వామి లక్షణాలుప్రవేశించాయి

మరి జపాను భూమి ఎవరి చేతుల్లో వుంది ?

మన జమీందారుల లాంటి పెద్ద పెద్ద  భూస్వాములు చెక్రవర్తి కింద వారికి వారుగా ఏర్పడ్డారు . వీరిని షోగన్ లు అంటారు . వీరు తమ ఇంటినుండి సైనికుల ద్వారా సాధారణ  ప్రజలను  పాలిస్తారు . ఈ షోగన్లు  తమకు ఇంకా ఎక్కువ జామీ లేదా భూమి కావాలని కోరుతూ చక్రవర్తి తో మర్యాద పూర్వక  మంతనాలు జరిపేవారు. షోగన్లలో కూడా అతి బలవంతుడు ఉంటాడు కదా ?

వాడు మిగతా షోగన్లను  బలిమిన లొంగ తీసుకొని చాలా ఎక్కువ భూమిని తన పేరున లేదా తన ఇంటి పేరునో పాలన చేసేవాడు . ఎంతమంది షోగన్లు వచ్చినా జపాను చక్ర వర్తికి ఏమీ ఢోకా  రాలేదు .  సంప్రదాయ ప్రకారం సూర్య దేముని వారసుడిగా   ఆయనను అందరూ గౌరవించారు .

వంశ పారంపర్యంగా వచ్చిన వ్యక్తి ఏ జపాను చెక్రవర్తి అవుతాడు కదా ? అలాగే చెక్రవర్తి కి  సేనానులుగా వుండే వారు కూడా వంశపారం పర్యంగా నే  సేనానులు అవుతారు . ఈ సేనానులను సమురాయ్ అంటారు , ఒక కుటుంబ ములో పుట్టిన మొగ వారు సమురాయ్ అవుతారు. ఆడవారు Onna-musha  అనే పేరుతో ఆడ సమురాయిలు  అవుతారు , వీరు యుద్ధాలలో కూడా పాల్గొంటారు . యుద్ధములో పురుషులకు వత్తాసుగా నిలుస్తారు . కానీ ఎక్కువగా రాణీ  మందిరాల రక్షణకు కట్టు బడి వుంటారు  .వీరికి రాజ  మందిరాలలో తిరగటానికి ఎక్కువ అవకాశం ఉండటం తో - వీరు తాము చూసిన విషయాలను పుస్తకాలుగా రాసేవారు . దీనిని బట్టి ఏ జపాను చెక్రవర్తుల ప్రవర్తనా వివరాలు తెలుస్తూ ఉంటాయి . The Tale of Genji  అనే

పుస్తకము వుంది . ఇది చెక్రవర్తికి అతని ఉంపుడు కత్తెకు పుట్టిన గెంజి అనే అతడిగురించీ - మరియూ స్త్రీల పట్ల చెక్కర వర్తుల దాష్టికాలు - స్త్రీలు వహించిన సహనము గురించి తెలియ పరుస్తుంది . ఈ పుస్తకము 1000 సంవత్సరాల క్రిందటిది . దీనిని నేను తెలుగులో రాసి చెపుతూ వున్నాను . మీరు చదవవచ్చును

సమురాయి అనేది ఒక ప్రత్యేక వంశము అయ్యింది . తన దెగ్గర పనిచేసే --. ఈ సమురాయిలకి, చక్రవర్తి తన ఇతర సేవకులకన్నా ఎక్కువ వేతనం - గౌరవాలు ఇచ్చేవాడు . చెక్రవర్తి ఇచ్చే వేతనం. ఏమిటంటే? - రైతులు పండించిన పంటల లోనుండి ఇంత అని వాటా తీసుకోండి అని ఒక అగ్నా్య పత్రము ఇవ్వటమే . అలాగే-- ఫలాని వర్గపు శ్రామికులను, రైతులను మీ ఇంటి పని మనుషులుగా వాడుకోండి అని చెపుతూ ఇంకో ఒక అగ్నా్య పత్రము ఇవ్వటమే. ప్రజలు ఈ ఆజ్ఞలను గౌరవించే వారు . అందువల్ల షోగన్ల లాగానే సమురాయి లకి కూడా ప్రజలతో ప్రత్యక్ష సంభందాలు వుండే వి .

నిజమైన నేల మరియూ మనుషులు షోగన్ ల కింద వున్నారు . సమురాయిల కింద  ఏదీ లేదు  . ఉత్తరువులేమో చెక్రవర్తి ఇస్తూ వున్నాడు .  అందువల్ల సమురాయిలు ఇటు చక్రవర్తితోనూ అటు షోగన్లతోనూ మంచిగా మసలుకుంటూ ఉండేవాఋ .  చక్రవర్తి ఆజ్ఞ మేరకు ప్రజలనుండి రాబట్టుకున్న  దాన్ని వాడి పెద్ద పెద్ద ఇళ్ళు కట్టుకునే వారు. సమూరాయులు ఎప్పుడూ కూడా ప్రజలతో ఘర్షణ పడినట్లు అగుపించదు.  పైగా సాధారణ ప్రజలు ఇచ్చిన విజ్ఞప్తులను తీసుకెళ్లి చెక్రవర్తికి ఇచ్చే వారు కూడా .



## picture of murasaki shikibu



**picture of murasaki shikibu** అనే ఆమె ది టేల్ అఫ్ గెంజి రాసింది . ఆమె ఫోటోని జాపనీస్ కరెన్సీ నోట్ల మీద ముద్రించి ఆమె చేసిన రచనలోని గొప్ప తనాన్ని గుర్తించారు .

జపాను చరిత్ర క్లుప్తంగా {8}

జాను చెరిత్ర మొత్తం మీద 126 మంది చక్రవర్తులు వున్నారు . వీరిలో "జిమ్ము" మొదటి అయన. ఇవాళ ఉన్న చెక్రవర్తి పేరు Naruhito. నారూహితో. . మళ్ళా షోగన్ల వద్దకు వద్దాము . షోగన్లో ఒకరైన Tokugawa వంశస్థులు , ఎక్కువ భూమి పై హక్కు కలిగి , ఇతర షోగన్ల పై దాడులకు దిగుతూ ఉండేవాబు . టోక్యోని నిర్మించినది కూడా వీరే . వీరు కాలక్రమంలో చెక్రవర్తుల వ్యవస్థ నే ప్రశ్నించాబు

ఇక ప్రపంచం అంతటా తన వాణిజ్యాన్ని విస్తరించటంలో భాగంగా - అమెరికా -- 1790 నుండి 1853,వరకూ మొత్తం 27 సార్లు తన సరుకుల ఓడలతో జపానుకి వచ్చింది . జపాను వాటిని లోనికి రానియ్యలేదు . అమెరికా 1854–1855 లలో మరో సారి "The Perry Expedition " అనే పేరు మీద అమెరికా యుద్ధ నౌకలు జపాను కు పంపింది . వివిధ ప్రపంచ దేశాలతో పాలనా పరమైన సంభందాలు పెట్టుకోవటం , వర్తక వాణిజ్యాలు వృద్ధి చేసుకోవటం , కొత్త ప్రాంతాలు

కనుగొనటం, ఈ భూ మండలం మీద ఏ ప్రాంతము నిజంగా ఎక్కడ వున్నది ? అనేది సర్వే చేయటం,లక్ష్యంగా అమెరికా నౌకలు జపాన్ వచ్చాయి .అమెరికాకి నుండి వచ్చిన నౌకలు, కమాండర్ Matthew Calbraith Perry,అనే అయన సారధ్యంలో , అమెరికన్ ప్రెసిడెంట్ Millard Fillmore.పంపగా వచ్చాయి . అమెరికన్ ప్రెసిడెంట్ ఆజ్ఞలు ఏమిటంటే ? " జపాను ను తుపాకీ తో బెదిరించి అయినా సరే అమెరికాతో వ్యాపారం చేసేట్లు చేయాలి - మరియూ జపాను చే అమెరికా ఆయుధాలను కొనిపించాలి" అని .

అమెరికా వాడే ఈ బెదిరింపు విధానాన్ని" gunboat diplomacy " అంటారు .




Above is image of american " gunboat diplomacy

gunboat diplomacy అంటే వీలున్నంత వరకూ ఎదుటి దేశపు ప్రభుత్వము తో చర్చలు జరుపుతారు - అవి సఫలం కానపుడు "గన్ బోట్," అనగా యుద్ధ నౌకలను వాడి ప్రభుత్వాన్ని లోంగ తీస్తారు .

బొగ్గుతో నడిచే రైళ్లు, ఓడలు , యంత్రాలు . మిల్లులు వంటి వాటితో అమెరికా ఒక పారిశ్రామిక శక్తీ గా ఎదుగుతూ వున్నది . బొగ్గు బంగారము వంటిది అయ్యింది . జపాను బొగ్గు గనుల మీద పట్టు

సాధించాలనే ఆలోచన కూడా అమెరికాకి వుంది . బొగ్గు వనరుల కోసము అని -- .ఈ పాటికే United Kingdom (130), France (90), Portugal (52), Netherlands (29), Germany (20), Russia (17), Denmark (9), Sweden (8), Italy (7), Norway (6), Belgium (3) and Spain (2). దేశాలలో వలస రాజ్య పాలన చేస్తూ {అనగా ఇంగ్లాండ్ ఇండియాను పాలించినట్లు } ఆ దేశాలలో ఉన్న బొగ్గు గనుల మీద పట్టు బిగిస్తూ వున్నవి . తన పట్టు లో వుండే బొగ్గు గనుల కోసం అని అమెరికా జపానును ఎంచు కొన్నది . జపాను చిన్న దేశమే అయినా , ఈనాడు దానిలో 44 పెద్ద బొగ్గు గనులు వున్నాయి జపాన్ బొగ్గు గురించి అమెరికా సరిగ్గానే అంచనా వేసుకుంది .

అమెరికా జపానుకు రావటానికి 220 సంవత్సరాలముందు నుండి , జపాను బయటి ప్రపంచముతో ఎటువంటి సంభందాలు పెట్టుకోకుండా -- ఒంటరిగా బ్రతుకుతూ వున్నది . తన జాతి మనుషులు తన ఆచారాలు వంటివి సంకరం కాకుండా ఉండేందుకు అని జపాను ఒంటరి తనము అవలంభించింది .

అందువల్ల జపానుకు బయటి ప్రపంచము తో వర్తక వాణిజ్యా   సంభందాలు లేవు .

జపాను ఒంటరిగా బతకటం ప్రపంచ దేశాలకు నచ్చలేదు .ప్రతి పాస్చాత్య దేశమూ కూడా " నువ్వు నాతో వ్యాపారము చేస్తావా చేయవా ?  అని జపానును బెదిరిస్తూ నే   వున్నవి .  అమెరికా జపాను కు రావటానికి  మునుపే  1844,లో  Dutch King William II



Above Photo  Dutch King William II statue

అనే అయన జపాన్ చెక్రవర్తికి " మా తో వర్తకానికి తలుపులు తీస్తావా? లేక మమ్మల్ని మీ తలుపులు బద్దలు కొట్ట మన్నావా ? అనే బెదిరింపు లేఖ పంపాడు . అందువలన డచ్ వారుతమకన్నా ముందుగా జపానులోకి అడుగు పెడతారేమో అన్న భయంతో అప్పటి అమెరికన్ ప్రెసిడెంట్  తన  యుద్ధ నౌకలను జపాన్ పంపాడు .కమాండర్ పెర్రీ - గన్ ఉపయోగించకుండానే జపానుతో వాణిద్య  సంభందాలు నెలకొల్ప గలిగాడు .

జపాను చెరిత్ర క్లుప్తంగా [5}    31-03-24




చివరికి- జపాన్ అమెరికాకి స్వాగతం పలికింది. అంటే అమెరికాతో స్నేహంగా ఉన్న ఇతర దేశాలకు కూడా స్వాగతం లభించింది అని కూడా అర్థం. జపానుతో స్నేహ ఒప్పందం కుదరగానే - అమెరికా వారు గన్ పాయింట్ తో అనేక మంది షోగన్ లను కూలదోసి ఆ భూమిని చెక్రవర్తికి ఇచ్చారు . ఇప్పుడు అనేక మంది షోగన్ల బదులు - జపాను తరఫున జపాను చెక్రవర్తి ఒక్కడు "ఒకే" అంటే చాలు, అమెరికా జపానులో ఏమైనా చేసుకోవచ్చు , తవ్వేసుకో వచ్చు .
ఇదంతా కూడా "మేజి" అనే చక్రవర్తి పాలనా కాలం లో జరిగింది . అందువల్ల దీని "మెజీ రెస్టోరేషన్ " అన్నారు.

జపాను చక్రవర్తి ఎప్పుడూ కూడా సర్వ స్వతంత్రుడు కాదు .ఆయనను ఎప్పుడూ  ఎదో ఒక జపాన్ వ్యవస్థ నియంత్రిస్తూ నే ఉండేది . ఇప్పుడు ఆ శక్తి  అమెరికా అయ్యింది . అందువల్ల చెక్రవర్తికి ఏమీ ఇబ్బంది అనిపించలేదు .

ఇప్పుడిక   సమురాయిల  దెగ్గరికి వద్దాము .  ఒకానొక సమయానికి ఈ సమురాయిల సంఖ్య ఆనాటి జపాను జనాభాలో ఐదు శాతానికి పెరిగింది  . వీరిని పోషించటం చెక్రవర్తులకు కష్టంగా మారింది . వీరి  సంఖ్య తగ్గించటానికి అని ,  1629, లో ఉన్న ఒక చక్రవర్తి ఒక చట్టము చేసాడు  - దాని ప్రకారం సమురాయి



Image of treditional సమురాయి

అనేవాడు కనీసం రెండు కత్తులు ధరించి, ఆ రెండింటినీ ఏకకాలంలో ఉపయోగించ గలిగి ఉండాలి అనే షరతు పెట్టాడు . అందువల్ల నే మనము సినిమాల్లో చూసే సమురాయిలు రెండు కత్తులు వాడతారు. రెండు కత్తులు లేనివాడు సమురాయి కాదు, మరెవరో అని అర్ధము .

అట్లాగే  తనడ్యూటీ కి  అడ్డం వచ్చిన "తక్కువ తరగతి వ్యక్తి " ని  చంపే హక్కు" అనగా "లైసెన్సుడ్ టూ  కిల్ "అనేది సమురాయిలకు ఈ రోజుల్లోనే వచ్చింది  .

సమురాయిలకి ఎక్కువ యుద్ధాలు చేయవలిసిన అవసరం పడేది కాదు. అందువల్ల తీరికగా ఉండి తమ గొప్పలు ప్రజలకు చూపిస్తూ ఉండేవారు . యుద్ధాలు నిజంగా జరిగితే తాము చూపబోయే సాహసాల గురించి , తాము పన్న బోయే తెలివి గల వ్యూహాల  గురించి కధలు సృష్టించే వారు . 13  శతాబ్దములో జపాను పై మంగోలియన్లు జరిపిన దాడిని సమురాయిలు సమర్ధవంతగా ఎదుర్కొని గొప్ప యుద్ధ వీరులుగా  పేరు తెచ్చు కున్నారు .     ఇక మెజీ పీరియడ్ లో అమెరికా పుణ్యమా అని , జపాను చెక్రవర్తి  సైన్యానికి  తుపాకీలు పరిచయం అయ్యాయి .  యుద్ధములో  కత్తుల వాడకం దానితో పాటు   సమురాయిల  అవసరం కూడా తగ్గి  . సమురాయిలు రాజు గారి కొలువులోని  ఉద్యోగాలలోకి మారారు . ."మెజీ"  సమురాయి వ్యవస్థను రద్దు చేసాడు . అప్పుడు కొందరు సమురాయిలు చదువులు మరియూ వర్తక వాణిజ్య నిర్వహణ వంటి

మెళుకువలు నేర్చుకున్నారు. తదుపరి ఈ సమురాయిలే జపాన్లోని ఇండస్ట్రియలిస్ట్ లు అయ్యారు . ఆడ, లేదా ,మొగ సమురాయిని bushi లేదా బుకే అంటారు .

ఇప్పుడు మితు బుషి అనే జపాను కంపెనీని గుర్తు తెచ్చుకోండి కొంత అర్ధం అవుతుంది . పుట్టుకతో సమురాయ్ అయిన Iwasaki Yatarō అనే సమురాయ్ /బుషి మారుతున్న పరిస్థితులను గమనించి , వచ్చిన అవకాశాలను అందిపుచ్చుకొని Mitsubishi corporation అనేదానిని స్థాపించి దాని ద్వారా నాగసాకి పట్టణాన్ని జపాన్ యొక్క ఇండస్ట్రియల్ ఏరియాగా మార్చాడు . సమురాయ్ లచే స్థాపింప బడిన కంపెనీలు జపాన్ ఆర్థిక వ్యవస్థలో కీలకంగా వృద్ధి చెందసాగాయి . జపాను ఒక ద్వీపము కాబట్టి దానికి అన్ని పక్కలా " సముద్ర జలాలు" వున్నాయి ఈ సముద్రాల పేర్లు "ది Sea of Japan.మరియూ "నార్త్ పసిఫిక్" .సముద్రము . ఈ సముద్రాలలో ముఖ్యంగా, ది Sea of జపాన్ " లో ఎటువంటి విదేశీ మిలటరీ నౌకా ప్రవేశాలూ, అలజడులు లేకుండా, వున్నపుడే , జపాన్ ఈ సముద్రాల కుండా

ఎగుమతులు -- దిగుమతులు చేసుకొని  ఆర్థికంగా అభివృద్ధి    చెంద గలుగుతుంది . జపాను చుట్టూ  ఉన్న సముద్ర జలాలు జపానుకు ఎంత లాభాన్ని  ఇస్తాయో , అంతే నష్టాన్ని  కూడా ఇస్తాయి .  ఎట్లాగంటే , ఈ సముద్రాల ద్వారా   జపాను ప్రపంచములో ఎక్కడికైనా పోవచ్చును,  వర్తకం చేసుకో వచ్చును . అదే రకంగా  -- జపాన్  అంటే గిట్టని వారు ఎవరైనా  సరే, ఎక్కడనుండి అయినా సరే  ఈ సముద్రాల మీదగా జపాను పైకి దండెత్తి వచ్చి  జపానును ఆక్రమించుకో గలరు లేదా .ఆ సముద్రాల మీద .  ఆధిపత్యం సంపాదించి    - జపాను ను ఎటూ కదలకుండా  నిర్బంధించి - జపానును అధోగతి లోకి  నెట్ట  నూ  గలరు  .

తన  వర్తక వాణిజ్యాలు సజావుగా జరగాలి అంటే  తన చుట్టు పక్కల ఉన్న  సముద్రము మొత్తము తన పెత్తనం    కింద నే వుండాలని  , జపాను- కోరిక

అప్పటికే పెద్ద దేశాలుగా ఉన్న రష్యా,  మంచూరియా లో కుండానూ  . చైనా , కొరియా లో కుండానూ  ,  తన సముద్ర జలాలలోకి ప్రవేశించి తనతో  యుద్ధాలు  చేసే వీలుంది అని జపాను జపానుకు ఒక వీడని భయము

వున్నది . కాబట్టి -  మంచూరియా మరియూ కొరియాలను  తన "అధికార  అంకుశం"   కింద ఉంచాలని జపాన్ చెక్రవర్తి కోరుకుంటూ  వున్నాడు.

ఏనుగు కుంభస్థలం మీద అంకుశం వాడే వాడికి  - ఏనుగుచేత కావాల్సిన పని చేయించుకోవటమే ముఖ్యం . దాని బాగోగుల గురించి , తిండి గురించి దాని యజమానిదే కదా భాద్యత . ఇదే మోడల్ లో, అమెరికా తన అంకుశాన్ని వాడి వేరే దేశాల ప్రభుత్వంతో తమకు కావాల్సిన పనులు చేయించుకుంటుంది .కానీ ఆదేశాల ప్రజల బాగోగులు చూసుకోవాల్సింది మాత్రం ఆయా దేశాలే అని చెబుతుంది . అమెరికా స్నేహంవల్ల జపాన్ కూడా ,అమెరికా లాగానే అంకుశాన్ని వాడే విధానానికి దిగింది .

Meiji చక్రవర్తి   మెజీ వ్యూహం ఏమిటంటే అమెరికా ప్రభావానికి కూడా లోబడకుండా ఆసియా ప్రాంతపు బలిష్టమైన  శక్తిగా ఎదగటం .  అలా ఎదగాలి అంటే దేశం ప్రశాంతంగా ఉండాలి . జపానును  చుట్టు ముట్టి ఉన్న సముద్ర జలాల కారణంగా ఆ  ప్రశాంతత లేకుండా

పోయేందుకు అనేక వీళ్ళు వున్నవి .  అందువల్ల జపాన్ చక్రవర్తికి  Manchuria మరియూ Korean ప్రాంతాలను  తన అంకుశం  కింద  వుంచుకోని, " ది సి ఆఫ్ జపానును"  పూర్తిగా సురక్షితం చేసుకోవాలన్న కోరిక కలిగింది.

జపాను మొదటిగా మంచూరియా వైపు ద్రుష్టి పెట్టింది .

మంచూరియా అనేది   చైనా- రష్యాల మధ్య ఉన్న భూభాగము . 1858 వరకూ ఇది చైనా అధీనంలో ఉండి, ఆ తరువాత రష్యా వారి అధీనం లోకి వెళ్ళింది  .

మంచూరియాకి ఒక పక్క the Sea of జపాన్,  మరొక పక్క Vladivostok అనే  రష్యన్ ఓడరేవు, మరొక పక్క

రష్యాకు చెందిన   Sakhalin అనే ద్వీపము



ABOVE IS Sakhalin ISLAND where japan boarder ends with USSR

వున్నాయి { ఈ Sakhalin  వద్ద నే "ది సి అఫ్ జపాన్ యొక్క  హద్దు "  ముగుస్తుంది }   రష్యా మంచూరియా లోనుండి "ది సి అఫ్ జపాన్"  లోకి ప్రవేశించి తనమీద దాడికి దిగుతుందేమో అనే  భయంతో - జపాను, రష్యాకు ఒక ప్రతి పాదన చేసింది,   దీని ప్రకారం, మంచూరియా విషయము లో ,  జపాను కలుగ చేసుకోదు .{ మంచూరియా చైనావారిది  కదా ? దాన్ని తిరిగి  చైనాకి వాపసు ఇవ్వండి అంటూ జరిగే

ఉద్యమాలకు మేము  ఎలాంటి మద్దత్తు ఇవ్వము - అని జపాను వారి భావము } అలాగే  కొరియా - జపాను మధ్య జరిగే  విషయాలలో  రష్యా   కలుగ చేసుకో రాదు" అని ప్రతి పాదించింది .   { అనగా కొరియాను ఆక్రమించుకోవాలన్న కొరికె మాకు వున్నది .మీరు కలుగ చేసుకోవద్దు అని అర్ధము }  ఆనాటికి చైనా రష్యాలు మిత్రులు . వీరు ఇద్దరూ  కలిసి కొరియాని తమ నోటిలో పడకుండా చేస్తాయేమో అన్నదే జపాను ఆలోచన అందుకే ఈ ప్రతి పాదన  .

జపాను  ఏ సముద్రాన్ని అయితే జపాను సముద్రము అని పిలుస్తున్నదో, అదే సముద్రాన్ని కొరియా దేశము కొరియా సముద్రము అని పిలుస్తూ ఉంటుంది  . తాను కొరియాని ఆక్రమించుకొని - కొరియా సముద్రాన్ని కూడా జపాను సముద్రము అన్న పేరుతో  పిలిపించటమే జపాను లక్షం . అందు  కోసమని కొరియాని ఆక్రమించాలని జపాను కలలు కంటూ వుంది .

ఇక  రష్యాకి సముద్ర తీరాలు అయితే వున్నవి కానీ , మంచు పడే కాలములో అవి గడ్డ కట్టుకు పోతూ ఉండేవి . సంవత్సరం పొడుగునా వ్యాపారాలు

చేయటానికి - మిలటరీ నౌకలను , తిప్పటానికి గానూ , మంచూరియా ద్వారా, "ది సి అఫ్ జపాన్" లోకి ప్రవేశించవలసిన అవసరము రష్యాకికూడా వున్నది . ఇలాంటి అవసరాలకోసమని రష్యా -- అప్పటికే, చైనా నుండి Port Arthur, అనే ఓడరేవును , లీజుకు తీసుకొని వాడుకుంటూ వున్నది. రష్యా చక్రవర్తి కూడా - ప్రపంచ దేశాలపై తన ప్రభావం పడేట్లుగా, వర్తక వాణిజ్య పరమైన విస్తరణలు జరపాలని కోరుకుంటూ వున్నాడు. అందువల్ల ఆయన జపాను ప్రతి పాదనకు ఒప్పుకోక . "మనము సముద్రాల మీద ఒక "బఫర్ జోను" ఏర్పాటు చేసుకుంటే చాలు అన్నాడు ."బఫర్ జోను" అనగా సముద్రము లో ఓ మొండి గుర్తుని ఏర్పరుచుకొని, అది దాటి మీరూ రావద్దు- దాన్ని దాటి మేమూ రాము అని. అన్నాడు

ఈ బఫర్ జోను ప్రతి పాదన వల్ల తాము కొరియా పై కి దండెత్తి వెళ్ళటానికి వీలు లేకుండా పోతుందని జపాన్ అనుకున్నది దీనితో 1904 - 1905 మధ్య రష్యాకు జపానుకు యుద్ధము జరిగింది.



EMPOROR MEJI as a emporor but not as a shinto leader

జపాను చెరిత్ర క్లుప్తంగా [6}   1-4-24

రష్యా తన ప్రతిపాదన తిరస్కరించిందన్న కోపంతో జాపనీస్ నౌకా దళము - 27 January 1904 న, Port Arthur, లో ఉన్న రష్యా నౌకలపై ఆకస్మిక దాడి చేసింది . రష్యా ప్రతి దాడి చేసింది .కానీ రష్యా నే ఎక్కువ గా నష్టపోయింది .



**Above is** రష్యా,చక్రవర్తి **Nicholas II**

అప్పటి రష్యా,చక్రవర్తి Nicholas II - యుద్ధము లో రష్యా గెలిచి తీరుతుంది అనే ధీమాతో ఉండేవాడు. అంతే కాక " సముద్రాల మీద ఓడలతో యుద్ధాలు చేసుకుంటే అది మనకు చివరికి ఏమి ర్పుతుంది? అదేమిటో కూడా తెలుసుకుందాము " అనే ఆలోచన

లో ఈయన వుండే వాడు . దీని అర్ధము, ఆయనకు నౌకా యుధాల, మీదపెద్దగా అవగాహన లేదు అని .

యుద్ద విరమణ చేయటం అవమానకరమైన సంగతి గా భావించిన రష్యా చక్రవర్తి తాను ఓడిపోతాను అని తెలిసి కూడా యుద్ధము కొనసాగించాడు . చివరికి US President Theodore Roosevelt కలుగ చేసుకోవటం ద్వారా ఈ యుద్ధము ఒక కొలిక్కి వచ్చింది . జపాను రష్యాల మధ్య Treaty of Portsmouth అనే ఒప్పందం కుదిరింది . ఈ ఒప్పందం ద్వారా రష్యా జపానును East ఆసియా ప్రాంతపు అత్యున్నపు శక్తిగల దేశం గా గుర్తిస్తుంది . అంటే ఇక నేను జపాను జోలికి రాను అని రష్యా తన పరువుపోకుండా ఒప్పుకుంది . రష్యాని ఎదుర్కోగల శక్తి ఒకటి సృష్టి అయింది . మన నేతాజీ గారు జపాన్ శక్తి పట్ల నమ్మకం ఉంచిన కారణాలలో ఇది కూడా వుంది . దీనితో జపాను రష్యా పై గెలుపు సాధించినట్లు -- . రష్యా చతికిల పడినట్లు - జపాను కొత్త మెగా శక్తిగా అవతరించినట్లు అమెరికా వేపు వారు అన్నారు .

తాను శక్తివంతమైన దేశముగా మారానని జపానుకూడా అనుకున్నది . ఇహ

ఇప్పుడు జపాను కొరియా సంగతి కూడా చూడ దలిచింది . జపాను వారు జపాను సముద్రము అని పిలిచే దానినే - కొరియా వారు  కొరియన్ సముద్రము అని పిలుస్తూ వున్నారు.     ఇంగ్లీష్   వారు దీన్ని "ఈస్ట్ సి" అని పిలుస్తారు  . కొరియన్ సి అనే మాట లేకుండా చేసి  - జపాను సముద్రము అనే మాట మాత్రమే ఉండేట్లు చేయటమే లక్ష్యంగా జపాన్ కొరియా  పై ధ్రుష్టి పెట్టింది.

జపాన్ కు  ,   కొరియాకు మధ్య వర్తక వాణిజ్య సంభందాలు వున్నాయి .Korea,లేదా   Joseon అని పిలవబడే ఈ దేశము   1636 నుండీ  1876 వరకూ చైనా వారి అధీనంలో వుంది . చైనాలోని మింగ్ చక్రవర్తి వంశం వారికి కప్పాలు కడుతూ వున్నది  . కొరియా ని చైనా వారి" vassal state " గా గుర్తిస్తారు   { vassal - అనగా కొరియా చెక్రవర్తి స్వతంత్రముగా వ్యవహరిస్తూ ఉంటాడు-  కానీ ముఖ్యమైన విషయాలలో చైనా వారి ఆజ్ఞకు లోబడి ఉంటాడు  }
.చైనా ఆదేశాల ప్రకారం   జపాను వారు ఎవరూ నేరుగా కొరియాలోకి రాకూడదు అన్న ఆంక్షలు వున్నాయి .

కానీ కొరియా చక్రవర్తితో  వంశపారంపర్య స్నేహము-బంధుత్వము  కల  జపాను వంశస్థుడు ఒకాయన  ఈ రెండు దేశాల మధ్య-  మధ్యవర్తిగా  వున్నాడు .
జపాను వారు తమ సరుకులు తెచ్చి ఈ మధ్యవర్తి ఒప్పగించితే - అయన వాటిని కొరియాలోకి పంపి అమ్మి పెడతాడు.   ఇలా సరుకులు అప్పగించటానికి అని కొరియావారు, జపాన్ కి  waegwan,అనే అవుట్ పోస్టును   కేటాయించారు . ఈ మధ్యవర్తిగారి ప్రభావము ఎంతగా ఉండేదంటే, జపాను నుండి వచ్చిన - ఎంత ముఖ్య మైన  లేఖ పైనైనా   ఈ యన అనుమతి ముద్ర  పడకుండా ఉంటే దాన్ని చెక్రవర్తి చదివే వాడే కాదు .  ఈ మధ్యవర్తి కి అంతటి గౌరవం ఉండేది .
waegwan,అనే అవుట్ పోస్టును  దాటి ,  జపాన్ వారు కొరియా లోపలికి మరియు దాని  రాజధాని సియోల్ లోకి రాకూడదని నిషేధం ఉండేది .

1876 వరకూ కొరియా  చైనా వారి   ఆధీనంలోనే వుంది. .జపాన్ చక్రవర్తి  Meiji period 1868  నుండీ 1912 వరకు .    1868, లో  - జపాను చెక్రవర్తి మేజి పంపిన  ప్రతినిధులు    కొరియాకి వెళ్లి - " మా చెక్రవర్తి మన రెండు దేశాల మధ్య సఖ్యత వుండాలని

కోరుకుంటున్నాడు"   అని చెప్పి waegwan,అనే అవుట్పోస్టులో  ఉన్న వారికి  ఒక లేఖను అందచేశారు . ఆలేఖలో    "మెజీ"  యొక్క హోదాని చూపిస్తూ  ko (皇) అనే బిరుదు అక్షరాలు వాడటం జరిగింది  . కొరియా వారి ప్రకారం ఈ "కో"  అనే బిరుదు అక్షరాలు ఒక్క చైనా చెక్రవర్తి మాత్రమే వాడాలి  . జపాన్ చక్రవర్తి - ఎక్కువలో ఎక్కువగా  "taikun (大君)" అనే బిరుదు మాటలను మాత్రమే వాడుకోవటానికి మాత్రమే అర్హుడు.

జపాన్ చక్రవర్తి ko (皇) అనే అక్షరాలు వాడాడు అంటే? --.  జపాను చెక్రవర్తి తనను తాను  చైనా చెక్రవర్తి తోసమానముగా  పోల్చుకుని,   కొరియా కి నేనే చెక్రవర్తిని అని చెపుతున్నాడా ? "  కొరియా చెక్రవర్తిని తన కింద సామంత రాజుగా     చూస్తున్నాడా ?? జపాను - కొరియాని తనతో  సమాన హోదాగల దేశంగా చూడటం లేదా ???  అని కొరియా చెక్రవర్తి  అనుమాన పడ్డాడు   .  అంతే కాక కొరియా చెక్రవర్తి దెగ్గరకు వచ్చే ఏ లేఖ మీదనైనా సరే మధ్యవర్తి సంతకం తప్పని సరికదా ? అలాంటి సంతకం ఏదీ   ఈ లేఖ పై లేదు . అందువల్ల -- జపాను పై కొరియాపెట్టిన నిభందనలను జపాను బే ఖాతరు చేయనట్లు కూడా భావించ బడింది . చైనానే ఈ

భూప్రపంచములోని అతి గొప్ప శక్తి - వారే మాకు ప్రభువులు  అనుకుంటూ కొరియా జపాను పంపిన దౌత్యవేత్తలను వెనక్కి పంపి వేసింది .

అసలు జపాన్ అలాంటి  మాటలు ఎందుకు వాడింది  ? లేఖ తయారు చేసిన వారి పొరపాటా ? అదేమీ కాదు - మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా మరియూ రష్యా మీద గెలుపుకు తగ్గట్లు గా  మెజీ చెక్రవర్తి అనేక కొత్త హోదాలను  బిరుదులను పెట్టు కున్నాడు  ఆ కొత్త హోదాకు తగ్గ బిరుదులకు తగ్గట్లు రాజముద్రలనుతయారు చేయించాడు .వాటినే కొరియాకు పంపిన లేఖలపై వాడారు . అదీ సంగతి.

జపాను చెరిత్ర క్లుప్తంగా {7}          4- 4-24

కొరియాతో,  జపాను దౌత్యం విఫలము అయ్యాక - జపానుకి , కొరియాకి మధ్యవర్తిగా  ఉన్న  వ్యక్తి  కూడా తన ప్రభావము కోల్పోయాడు . ఎందుకంటే కొరియా వారు  "మీ జపాన్ చక్రవర్తి రాజ ముద్రలతో పాటు - మన  సంధానకర్తయొక్క అధికార ముద్రలు ఏవీ?"   అని అడిగారు కదా ?  "అంటే మా చక్రవర్తి - ఆ వ్యాపారీ మీకు ఒకే రకంగా   సమానమా? "

అంటూ జపాను ఏ ఈ మధ్యవర్తిని పక్కకు పెట్టింది .అంటే కొరియా తో సంప్రదింపులు జరపటానికి ఉన్న మార్గాన్ని మూసి వేసింది .

కొరియా , తన అంకుశం కింద ఉండటం జపానుకు ఎంతో అవసరం. ఆ అవసరత ఎంతది అంటే -- కొరియా ప్రజల ఫీలింగులు దెబ్బతినకుండా వుండటము కోసము అని జపాను చెక్రవర్తి తన హోదాలను - చిహ్నాలను మార్చుకుంటూ వచ్చాడు .

1867 నుండీ – 30 July 1912 వరకూ జపాను కు మేజీ నే చెక్రవర్తి. ఈయన పంపిన దౌత్యవేత్తలను కొరియా తిరస్కరించిందికదా ? తమ చెక్రవర్తి ని కొరియా లెక్క చేయలేదు అని జపాన్ జనం అనుకున్నారు .

అందువల్ల 1869–1873 , మధ్య ' మనము కొరియాను జయిద్దాము " అనే నినాదం జపానులోపుట్టిన సుడిగాలి అయ్యింది . అధికారులలో కొందరేమే తక్షణమే వెళ్లి కొరియాను జయిద్దాము పదండి పదండి , అనగా, మరి కొందరేమో జపాను ఇంకొచము ఆధునికం అయినాక అంటే అమెరికానుండి మరిన్ని ఆయుధాలు సమకూరినాక , కొరియా మీద యుద్ధము చేద్దాము అన్నారు .

ఎవరూ కూడా కొరియా మీద జపాను యుద్ధము చేయరాదు అని అనలేదు. .కారణాలు అనేకం . జపాను వారి ఉద్దేశ్యము లో కొరియాను జయించటం అతి సులువు . ఇహ జపాను ప్రజల దృష్టిలో కొరియా వారు కూడా తమ జాతి ప్రజలే . తమ జాతినంతటిని ఏకీకరించటానికి గానూ కొరియాని యుద్ధములో గెలవటం ఒక్కటే మార్గము అని జపాను అనుకున్నది . కొరియా ఎంతో వెనుకపడిన దేశము కాబట్టి దాన్ని ఆక్రమించుకొని అక్కడి ప్రజలకు సుఖ సంతోషాలు రుచి చూపటం, తన కర్తవ్యం లేదా హక్కు అని, ఆ జాతికి చెందిన అగ్ర దేశంగా ,పెద్దన్నగా , వారిని జయించటం వారి మంచికే, అంటూ జపాన్ తన సామ్రాజ్య వాదాన్ని సమర్ధించుకున్నది . కొరియా పై దాడి చేసి దాన్ని ఆక్రమించుకున్నది . తమ దేశంలో జరుగుతున్నా అంతర్గత తిరుగు బాట్ల కారణంగా చైనా చక్రవర్తి కొరియా కి జపానుకి మధ్య జరుగుతున్న యుద్ధములో జోక్యం చేసుకోలేక పోయాడు . కానీ ఆతరువాత ,జపాను సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా అంటూ చైనా 1937 నుండీ – 1945 వరకూ జపానుతో యుద్ధము చేసింది. ఈ యుద్ధము రెండో ప్రపంచ యుద్ధములో కలిసి పోయి జపాను ను పలు ఇక్కట్ల పాలు చేసింది .

నిజానికి జపాను కన్నా కొరియానే ప్రాచీనమైనది . కొరియా వారు , జపానును కాదని, చైనాలోని వారే తమ పూర్వీకులు అని నమ్ముతూ వుంటారు . 1910 నుండీ 1945, వరకూ కొరియా, జపాను సామ్రాజ్యంలో భాగంగా ఉంది . ఇంతలో రెండో ప్రపంచ యుద్ధము వచ్చింది . రెండో ప్రపంచ యుద్ధములో జపాను మీద గెలిచిన అమెరికా-రష్యాలు జపానుకింద ఉన్న కొరియాని రెండుముక్కలుగా విడదీసి పంచుకున్నాయి . ఎందుకంటే యుద్ధ వ్యూహాల రీత్యా జపాను వారికి కొరియా ఎంత అవసరమో - రష్యా, అమెరికాలు కూడా అంతే అవసరం పడింది .

జపాన్ వారు కొరియా ని పాలించినపుడు కొరియా వారిని చాలా చిన్న చూపు చూసి - వాళ్ళు జపాను సంప్రదాయాలను తప్పక అనుసరించి తీరాలి అన్నట్లు వ్యవహరించి వారిని నిర్బంధ పెట్టింది . అందువల్ల ఇప్పటికీ జపానుకు కొరియాకి పడదు .

"మెజీ "తన హయాములో అనేక సంస్కరణలు చేస్తూ వచ్చాడు . అయన జపాను పాస్చాత్య దేశాలకు దీటు కాదగిన దేశంగా ఎదగాలనే ఉద్దేశ్యం లో ఉన్నాడే కానీ -- అమెరికా కింద వుండాలని కోరుకోవటం లేదు . ఆలాంటి పరిస్థితులు రాకుండా చూసుకుంటున్నాడు . ఇందులో భాగంగా జపాను చక్రవర్తి తన అధికారులను, విద్యార్థులను

పశ్చిమ దేశాలకు పంపి - వారు అక్కడి ఇంజినీరింగ్, కళలు, సైన్సు , మెడిసిన్ వంటి విద్యలు నేర్చుకొని వచ్చేటట్లు చేసాడు . చివరికి జపాను పాశ్చత్య దేశాల పోకడలను , అక్కడి శాస్త్రాలను తెలుసుకొంది . జపాను పారిశ్రామిక దేశం అయ్యింది . సంస్కరణలతో భాగంగా విదేశీ విద్యావేత్తలను - న్యాయ నిపుణులను జపాన్ కి పిలిచారు .ఆ రోజుల్లో వీరి జీతము ఒక జపాను మంత్రి కన్నా అధికంగా ఉండేది . ఇలాంటి విద్యావేత్తల దెగ్గర లా చదివిన Soejima Taneomi అనే ఆయన జపాను విదేశాంగ శాఖను చేపట్టాడు . ఈయన తనకు అబ్బిన "లా " పరిజ్ఞనంతో అంతర్జాతీయ వ్యాపార వాణిజ్య చట్టాల గురించి కూలంకషంగా తెలుసుకొని - ఆ విషయాలు జపానుపారిశ్రామిక వేత్తలకు తెలియ పరిచాడు .ఈ అంతర్జాతీయ చట్టాలు ఇచ్చే హామీ కారణంగా - సరైన చెల్లింపులు అందక వర్తకంలో నష్టపోవటం అనేది ఉండదు అని గ్రహించి న - జపాను అప్పటినుండీ అంతర్జాతీయ వర్తక వాణిజ్యాల మీద ద్రుష్టి పెట్టింది . జపాను ఇట్లా క్రమంగా అంతర్ జాతీయ వర్తకంలోకి అడుగు పెట్టింది . ఇప్పుడు జపాను కొరియా మీదా, చైనా మీదా, తనకు ఉన్న శత్రుత్వ ద్రుష్టి విడిచిపుచ్చి - వ్యాపార దృష్టిని అవలంభించింది. ఈస్ట్ ఆసియా లో – చైనాను , రష్యాను– మించిన బలిష్ట శక్తిగా ఎదగాలని జపాను పావులు కదుపుతూ వున్నది . అమెరికా నీడలో ఉండాలన్న ఉద్దేశము జపానుకు లేదు .జపాను

ప్రపంచములోని రెండు లేదా మూడో గొప్ప శక్తిగా ఆవిర్భవిస్తూ వున్నది. ఈ కారణాన్ని బట్టి నేతాజీ గారు జపానుతో మిత్రుత్వం నెరిపాడు .

సేకరణ సమర్పణ వారణాసి శ్రీ రామ కృష్ణ

జపాను చెరిత్ర క్లుప్తంగా {08 }   6-4-24

ఒకరిని ఒకరు వాటేసుకోవటం తో మొదలైన   అమెరికా -- జపాను సంభందాలు  ఎందుకు చెడ్డాయి ?   అనేది తెలుసుకుంటే గానీ జపాన్ మీద అణు బాంబు ఎందుకు పడింది అనేది తెలియదు .అందుకని అటు వైపు కూడా చూద్దాము .

జపాను చైనాకు మధ్య Second Sino-Japanese War, (1937–45), జరుగుతూ వున్నది . ఈ యుద్ధములో భాగముగా -  చైనాను కట్టడి చేయటం కోసము అని , September 1940 లో జపాను,  వియత్నాం పై దాడి కి దిగింది . Cambodia, Laos, మరియూ  వియత్నాం   ను కలిపి ఇండో చైనా అంటారు .   తరువాత, తరువాత  ఈ ఇండో చైనా ఏ ,  ఫ్రెంచ్ ఇండో చైనా అయ్యింది . అనగా ఈ ప్రాంతము ఫ్రాన్స్ వారి అధీనంలో కి పోయింది  అని అర్ధము . చైనా వారు  ఫ్రెంచి వారినుండి ఆయుధాలను కొని **--**   వియాత్నం నుండి చైనాలోకి వచ్చే రైలు మార్గాల ద్వారా,   ఆయుధాలు చమురును  దిగుమతి,  చేసుకుంటున్నారు  . ఈ సప్లై లకు ఆటంకం కలిగించే ఉద్దేశ్యంతో,   జపాను  వియాత్నాం పై యుద్ధానికి దిగింది .  ఫ్రెంచ్  వారి అధీనములో ఉన్న ఈ వియత్నాం పై ,   కేవలం నాలుగు రోజుల యుద్ధముతో  **(22** సెప్టెంబర్ నుండీ  **26 September  1940 }**  జపాను

గెలుపొందింది .} వియత్నాంను ఆక్రమించుకున్నది .
వియాత్నం ద్వారా చైనాకు సప్లైలు అందే మార్గాలను మూసి వేసి , చైనా ను గెలవకుండా చేసి - తానే ఒక గొప్ప శాశ్వత ప్రాంతీయ శక్తిగా రూపొందాలి అన్నదే జపాను కోరిక . ఫ్రెంచ్ జపాను - ప్రభుత్వాలు ఒక ఒప్పందానికి వచ్చి - చైనాకు ఆయుధాలు చమురు అందే రైలు మార్గాన్ని మూసి వేసాయి . జపాను వరుస విజయాలు సాధిస్తూ బీజింగ్ వైపు రావటంతో, చైనా జపానుతో ఒక శాంతి ఒప్పందానికి వచ్చింది . ఈ వప్పందం ప్రకారం - చైనా కొరియాని తన అదుపులో లేని స్వతంత్ర దేశంగా గుర్తించింది .
మంచూరియాని కూడా రష్యా నుంచి తీసి జపానుకే ఇచ్చింది .దీనితో పాటు చైనా భూభాగము లో వర్తకం చేసుకోవటానికి వీలుగా జపానుకు అనేక మెసులు బాట్లు /ప్రత్యేక హక్కులు కల్పించింది . ఈ యుద్ధము తరువాత అతి పెద్ద భూభాగము ఉన్న చైనా కన్నా కూడా - జపానుయే ఒక బలమైన శక్తిగా అవతరించింది .

.

జపాన్ కూడా - అమెరికాలగానే ఒక పెద్దన్నగా ఎదుగుతూ ఆసియాలో ఒక ప్రపంచ శెక్తి గా రూపొందుతున్నదని ఇతర ప్రపంచ దేశాలు అభిప్రాయ పడ్డవి . జపాను ఒక ప్రపంచ శెక్తిగా ఎదుగుతూ ఉండటం అమెరికాకి నచ్చలేదు. .ఇంతే కాక చైనాలోని వ్యాపారానికి గానూ జపాన్ కొన్ని ప్రత్యేక

హక్కులు సాధించుకొని వుంది కదా ? ఈ రకంగా తన వ్యాపారానికి బొక్క పడటం అన్నది ది కూడా అమెరికాకి నచ్చలేదు . దానితో జపాను మీద ఆంక్షలు విధించింది . జపానుకు అమెరికా లో ఉన్న ఆస్తులన్నింటిని స్తంభింప చేసింది . జపానుకు అందే ముడి చమురు మీద ఆంక్షలు పెట్టి అమలు పరిచింది. July 1941, నుండి అమెరికా జపానుతో వ్యాపార సంభందాలు కూడా మానుకున్నది . అంటే, టెక్నాలజీని ఆయుధాలను ఇవ్వటం మానేసింది . Great Britain, చైనా, Netherlands కూడా అమెరికాతో చేతులు కలిపి జపాన్ తో వాణిద్య సంభందాలు ఆపివేసుకున్నాయి .

జపానుతో తెగతెంపులు చేసుకున్న అమెరికా July 1941 నుండి , గగన మార్గము ద్వారా జపానుకు 6,475.98 km



**Above is** హవాయి ద్వీపాలు

దగ్గరలో  ఉన్న   హవాయి ద్వీపాలలోకి వచ్చి మకాం పెట్టింది .  గగనతలం ద్వారా అమెరికా నుండి జపానుకు ఉన్న దూరము 9,723.62 km.  హవాయి లో దిగటం ద్వారా అమెరికా తనకూ జపానుకు ఉన్న దూరాన్ని 3247  KM తగ్గించుకుంది.  అమెరికా నా దరిదాపుల్లోకి ఎందుకు వచ్చింది ? నా సముద్ర జలాల పైన పట్టు కోసమేగదా ? అని జపాను భయపడ్డది .

ఇహ హవాయి ద్వీపాల గురించి తెలుసుకుందాము . 1778 లో యూ కె కి చెందిన కెప్టెన్ జేమ్స్ కుక్ అనే ఆయన గుర్తించాడు . హవాయి మొత్తము ఎనిమిది ద్వీపాల సమూహము . ఇంగ్లాండ్ వారు ఈ ద్వీపాలు తమకు పనికి రానివిగా భావించి వదిలి వేయగా , అమెరికా వాటిని 1898 లో ఆక్రమించుకుంది . జపానుతో ఏదన్న యుద్ధము చేయాల్సి వస్తే ఈ దీవులనే తన స్థావరాలుగా చేసుకోవాలని అమెరికా వ్యూహము . యుద్ధరంగములో ఈ దీవులకు ఉన్న ప్రాముఖ్యత దృష్ట్యా అమెరికా **Hawai'i** ద్వీపాన్ని **August 21, 1959.**నుండీ తనకు ఉన్న **50** రాష్ట్రాలలో ఒకరాష్ట్రం గా చేసుకుంది **.**నేటికీ అమెరికా సంయుక్త రాష్ట్రాలలో హవాయి **50** వ రాష్ట్రము గా వుంది **.**
హవాయి దీవులకు ముఖద్వారము అన తగిన చోట - అమెరికా Pearl Harbor అనే ఓడ రేవును నిర్మించుకుంది . తన యుద్ధనౌకలను అక్కడకి చేరుస్తూ / నిలుపుతూ వుంది .

జపాన్ తన వాణిజ్యము మరియూ సామ్రాజ్య విస్తరణలో భాగంగా ఇండోనేషియా మీద మరియూ మలేషియా మీద కూడా సైనిక దాడులకు దిగింది . . ఇండోనేషియా ని Dutch East Indies అని కూడా అంటారు . అనగా అది డచ్ వారి అధీనములో ఉన్న దేశము అని అర్ధము . ఈ Dutch East

Indies ను 1941–1942 లో జయించిన జపాన్ అక్కడ మూడున్నర సంవత్సరాల పాటు పాలన చేసింది. . ఇండొనేషియా లో ఉన్న ఆయిల్ నిల్వల కారణంగా ఇది జపాను వారికి అతి ముఖ్య విజయము అయ్యింది . జపాను Dutch East Indies ను ఆక్రమించుకోవటాన్ని అల్లైడ్ కంట్రీస్ అనగా అమెరికా మరియూ దాని మిత్ర దేశాలు అడ్డుకో లేకపోయాయి .

మలేషియాను కూడా జయించేందుకు December 1941 జపాన్ అటు కదిలింది. అమెరికా మరియూ దాని మిత్ర దేశాలు జపానును అడ్డుకొని యుద్ధము చేశాయి . దీనిని " battle of jitra " అంటారు . ఈ యుద్ధములో జపాను ఏ విజేత అయ్యింది .ఈ దెబ్బ తరువాత అమెరికా మరియూ దాని మిత్ర దేశాలు " మనము ఒక్క "సింగపూరు" విషయంలో తప్ప మరెక్కడా జపాను ను ఎదుర్కో వద్దు " అని నిర్ణయించుకున్నాయి .దీనితో జపాను, అమెరికాను కూడా ఓడించినట్లే అయ్యింది

ఇక మలేషియా అనేది జపానుకు ఎందుకు కావాల్సి వచ్చిందో ? కూడా చూద్దాము. మలేషియా లో తనకు ఉన్న వ్యాపారాలు పటిష్టం చేసుకోవాలని , మలేషియాలో ఉన్న ఇనుము ,ముడి ఖనిజాలు తెచ్చుకోవాలని ,

మలేషియా సముద్ర జలాలలో నిరాఘాటంగా చేపలు పట్టుకొవాలి అని , యుద్ధ సమయాలలోమలేషియా నుండి జపానుకు నిరంతర ఆహార సరఫరా జరిగేట్లు చూడాలని , - జపాన్ మలేషియాని జయించింది .

జపాన్ అనేక దేశాలమీద దాడి చేస్తూ వున్నది కదా ? అన్నిటి వెనుకా ఉన్న ముఖ్య ఉద్దేశ్యము ఏమిటి ?? అంటే . మొదటిది అమెరికా తన జోలికి రాకుండా చూసుకోవటం - రొండోది -- ఎవరి అభ్యంతరం లేకుండా Southeast Asia దేశాలైన Brunei, Burma (Myanmar), Cambodia, Timor-Leste, Indonesia, Laos, Malaysia, the Philippines, Singapore, Thailand and Vietnam. దేశాలను తన అంకుశం కిందకు తెచ్చుకోవటం . అమెరికా లాగానే వర్తక వాణిజ్య రంగాలలో దూసుకు పోవటం .

జపాను చెరిత్ర క్లుప్తంగా {9} 8-4-24

జపాను కి అమెరికాకి పడక పోవటానికి గల ముఖ్య కారణం -- జపాన్ చుట్టు పక్కల ఉన్న దేశాలలో ముఖ్యంగా ఫిలిప్పీన్స్లోను ,హవాయి లోనూ అమెరికా తన మిలటరీ స్థావరాలు విస్తరిస్తూ అక్కడి సముద్ర జలాలపై ఆధిపత్యం పెంచుకుంటూ ఉండటం . ఇంకో కారణం - చైనా లోనూ ఆసియా దేశాలలోను ఉన్న వ్యాపార మార్కెట్లను ఎవరు

సొమ్ము చేసుకోవాలి? ఆ దేశాల  సహజ వనరులను ఎవరు దోచుకోవాలి ? అనే   విషయము మీద ఇద్దరికీ విభేదాలు రావటం అనే కారణాల   వల్ల వీరి స్నేహం చెడింది . July 1941, నుండి అమెరికా జపానుతో వ్యాపార సంభందాలు కూడా మానుకున్నది       27 September 1940 న, జపాను,  జెర్మనీ ఇటలీ లు , కలిసి  "ది బెర్లిన్ ఒప్పందం" అనే ఒప్పందాన్ని కుదుర్చుకున్నాయి.   .  మరి ఈ ఒప్పందం కోసం జపాను ఎందుకు పోయింది ? ఎందుకు అంటే - పాస్చాత్య దేశాల {United States, Canada, } పోకడలకు వాటి ఆధి పత్యానికి వ్యతిరేకంగా ఒక శక్తిని నిర్మించాలన్న ఉద్దేశ్యము యూరోపియన్ దేశాలకు కలిగింది . ఆదేశాలు అన్నీ కలిసి Germany మరియూ  Italy నాయకత్వం కింద నడవాలని నిర్ణయం తీసుకున్నాయి . తనకు వ్యతి రేకమైన అమెరికాకి వ్యతి రేకంగా జెర్మనీ ఆధ్వర్యములో  ఒక శక్తీ నిర్మితము అవుతూ ఉండటంతో జపాను వెళ్లి జెర్మనీ తో  చేతులు కలిపి బెర్లిన్ ఒప్పందం చేసుకుంది . జపాను మరియూ జెర్మనీ కలిసి తాను ఎదుర్కోలేని శక్తిగా ఎదుగుతాయేమోనని అమెరికా భావించింది .     జపాను,  జెర్మనీ ఇటలీ లు , కలిసిన ఈ మూడు దేశాల  కూటమిని యాక్సిల్ పవర్స్ అంటారు . Axis అనగా ఇరుసు . దేని చుట్టూ అయితే ఒక చక్రం తిరుగుతుందో అదే ఇరుసు .   ప్రపంచము లోవున్నా

ఇతర దేశాల వ్యాపార వాణిద్య వ్యవహారాలు అన్నీ Rome–Berlin–Tokyo చుట్టూ తిరుగుతూ ఉండేటట్లు చేయాలన్నదే -- ఈ ఒప్పందం లోని సారము . ఈ ఒప్పందమే రెండో ప్రపంచ యుద్ధానికి పూర్తి ఊపిరి పోసింది . యాక్సిల్ పవర్స్ ను ఎదుర్కోవటం కోసమని June 1941 బ్రిటన్, అమెరికా. ఫ్రాన్స్ , రష్యాలు కూడా ఒక ఒప్పందం కుదుర్చు కొని మిత్ర రాజ్యాలు గా ఏర్పడ్డాయి . దీన్ని అల్లైడ్ ఫోర్సెస్ అంటారు . యాక్సిస్ పవర్, అని అల్లైడ్ పవర్స్ అనే రెండు కూటములు ఏర్పడినాయి. ఒక్క మాటలతో చెప్పాలంటే ప్రపంచ దేశాల లోని వర్తక వాణిద్యాలు రాజకీయ వ్యవహారాలూ వంటివి , ఎవరి చేతుల్లోకి పోవాలో అనేదాన్ని నిర్ణయించటానికి -- అనే ఈ రెండు పవర్స్ మధ్యా యుద్ధము జరిగింది అనవచ్చు . తనకు వ్యాపార ప్రయోజనాలు లేకపోతే అమెరికా దేనిలోనూ జోక్యం చేసుకోదు కదా ? ఇహ జపాను కూడా అంతే అదికూడా వ్యాపారాన్ని కోరుకునే దేశమే కదా ? అందువల్ల రెండో ప్రపంచ యుద్ధము వర్తక వాణిజ్య ప్రయోజనాల కోసమే జరిగింది అనటం లో అసమంజసం ఏమీ లేదు . జపాను ఈ బెర్లిన్ ఒప్పదం చేసుకోక పోయి ఉంటే ఎలా ఉండేదో ? ఈ ఒప్పందములోనికి దిగినందువల్ల ప్రపంచ యుద్ధము

రొండు జరగటానికి - జర్మనీ కన్నా జపానుయే ఎక్కువ భాద్యత వహించవలసి వచ్చింది. అదీ అమెరికా వారి దృష్టిలో . ఇది ఒక కారణంగా , జెర్మనీ మీద కానీ ఇటలీ మీద కానీ పడని ఆటం బాంబ్ జపాన్ మీద పడింది . జపాన్ ఇంతకు మునుపే మలేషియాని Dutch East Indies ని - గెలిచి అమెరికాను బేఖాతరు చేసింది కదా ? అందువల్ల అమెరికా వూరికే చూస్తూ కూచోదని - తప్పక ప్రతి దాడులకు దిగుతుందని, జపాన్ ఊహించింది . ఈ ప్రతి దాడులు పెర్ల్ హార్బర్ నుండే జరుగు తాయని -- అటువంటి దాడులు జరగకుండా చూడాలంటె తానే ముందుగా మేల్కొని, పెర్ల్ హార్బర్ ని నాశనం చేస్తే , అమెరికా వెనక్కి తగ్గి తనతో ఏదన్నశాంతి ఒప్పందానికి వస్తుందేమో నని జపాను ఆలోచించింది . 7 December 1941, న జపాన్ యుద్ధ విమానాలు ఆకస్మికంగా వెళ్లి హవాయి లోని పెరల్ హార్బర్ లపై దాడి చేశాయి . 350 జపాను విమానాలు రొండు గ్రూప్ లుగా విడిపోయి - ఒకటి అమెరికా యుద్ధ నౌకల మీద బాంబులు వేయగా ఇంకోటి అమెరికా యుద్ధ విమానాల మీద బాంబులు వేసింది . అందువల్ల అమెరికా ఎదురు దాడులు చేయలేక పోయింది . ఈ దాడులలో 2,280 అమెరికా సైన్యపు వారు మరణించగా 1,109

గాయపడ్డారు . సాధారణ పురులు 68   మంది కూడా మరణించారు .   08 - December 1941 న   అమెరికా అధికారికంగా  జపాను మీద యుద్ధము ప్రకటించింది . ఆ తరువాత నాలుగు సంవత్సరాల పాటూ అనగా 1945  లో రొండో ప్రపంచ యుద్ధము ముగిసే వరకూ - అమెరికా తనకు కనపడిన ప్రతి జపాన్ విమానాన్ని  నౌకనూ ధ్వంసం చేస్తూ వచ్చింది .జపానును ముఖ్య శత్రువుగా చూస్తూ వచ్చింది .  September 1, 1939, న జెర్మనీ వెళ్లి  పోలాండ్ పై దాడి చేయటంతో ప్రపంచ యుద్ధము - రొండు కు బీజం పడింది.

సేకరణ సమర్పణ  వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి




ATTACK ON PEARL HARBOR    PHOTOS

జపాను చరిత్ర క్లుప్తంగా {10}        11-4-24

27 September 1940 న, జపాను,  జెర్మనీ ఇటలీ లు , కలిసి  "ది బెర్లిన్ ఒప్పందం"  అనే ఒప్పందాన్ని

కుదుర్చుకున్నాయి కదా ? ఈ ఒప్పందం ఇచ్చిన బలంతో . 7 December 1941, న జపాన్ యుద్ధ విమానాలు ఆకస్మికంగా వెళ్లి అమెరికా వారి పెరల్ హార్బర్ లపై దాడి చేశాయి. దీనికి బదులుగా 08 - December 1941 న అమెరికా అధికారికంగా జపాను మీద యుద్ధము ప్రకటించింది.

January 20,1941 నుండీ April 12, 1945 లో తాను చనిపోయే వరకూ Franklin D. Roosevelt అమెరికా కు ప్రెసిడెంట్ .
బెర్లిన్ ఒప్పందం ప్రకారము- ఇటలీకి మరియూ జెర్మనీకి– జపాను వారుమిత్రులు కాబట్టి, మిత్ర ధర్మాన్ని అనుసరించి - ఇటలీ **December 11, 1941,** అమెరికా పై యుద్ధము ప్రకటించింది . {అమెరికా జపాను పై చేసిన దాడికి నిరసనగా}ఆ వెంటనే అదే రోజు జెర్మనీ కూడ అమెరికా పై యుద్ధము ప్రకటించింది **.** అమెరికా కూడా ఎదురు యుద్ధము ప్రకటించింది **.** ఆలా అమెరికా రెండోప్రపంచ యుద్ధములో కి దూకింది .

యుద్ధము ప్రకటితము కాగానే , అమెరికాకి ప్రెసిడెంట్ అయిన Franklin D. Roosevelt, ఒక ఆర్డర్ పాస్ చేసాడు . దీని ప్రకారం అమెరికా కి కొత్తగా వలస వచ్చిన జపాను వారినీ - ఎప్పుడో అమెరికాకి వచ్చి చట్టబద్ధంగా అమెరికా పౌరులు అయిన "జాపనీస్ అమెరికన్స్ " ని కూడా గుర్తించి, వారిని జైళ్లు అన తగ్గ కాంపులలోకి పంపించి తాళాలు వేశారు . ఇలా 127,000 మందిని క్యాంపుల్లో పెట్టారు , అమెరికాలో తిరుగుతూ ఏమాత్రం జపాను పోలికలతో కనపడ్డ వారినైనా సరే జైలు క్యాంపులకు తరలించారు . అమెరికా జనాభా లెక్కల లిస్ట్ ప్రకారం జపాను వాడు అని నమోదు అయినా ప్రతి వాడిని కూడా జైలు క్యాంపులకు పంపారు .{కులము మతము ప్రాంతము దేశము అనే వివరాలతో రూపొందిన జనాభా లెక్కలు యుద్ధాలలో ఈ రకంగా కీలక పాత్ర వహిస్తాయి అని మనకు తెలుస్తోంది .}

జపాను వారిని జైలు కాంపుల్లో పెట్టినపుడు -అప్పటికే కడుపుతో వున్న ఆడ వారు కనక మానరు కదా? మరి ఆ కొత్తగా పుట్టిన { 5,981 births } వారిని ఏమి చేయాలి? ముసలి వారు అనారోగ్యంతోనూ వున్నవారు చావక మానరుకదా ? మరి వారికి అంత్య క్రియలు (1,862

deaths } ఎవరు చేయాలి ? ఏ సంప్రదాయం ప్రకారం చేయాలి ?  అట్లాగే ఈ జైలులో వుండే  మైనర్లను {బీలో 18 years } ఏమిచేయాలి ? అప్పటికే చదువులలో వున్న యువకులకు చదువు చెప్పించాలా వద్దా ? మేజర్లు అయినా జపాన్ కుర్రకారుని ఏమి చేసుకోవాలి ? లాంటి అనేక నూతన సమస్యలుపుట్టుకు వచ్చి అమెరికాకి తలనొప్పిని తెచ్చాయి . ఇలాగే అమెరికా లో ఉంటున్న ఇటలీ వారిని జెర్మనీ వారినీ కూడా అమెరికా జైళ్లకు తరలించారు . వారు కూడా లక్షల్లో వున్నారు

యుద్ధము ప్రకటితము కాగానే ముందుగా ఏమవుతుందో తెలుసుకున్నాము . ఇహ యుద్ధము మొదలు కాగానే , ఏదేశము అయినా సరే తాము దాడి చేస్తున్న దేశము లో తన యుద్ధ అవసరాలకు పనికి వచ్చే మంచి నీటి చెరువులు /కాల్వలు ఎక్కడ ఉన్నవీ గుర్తించి వాటిని ఆక్రమించుకొంటానికి ప్రయత్నిస్తాయి. ఆపై, ఆ నీటిని సైనిక దళం అవసరాలకు వాడుకుంటూ యుద్ధము చేస్తారు. నీటిని నేరుగా తాగకుండా ఆ నీటి వనరుల దరి దాపుల్లో బోరింగ్ పంపులు తవ్వి మాత్రమే ఆ నీటిని వాడుకుంటారు . ఈరకంగా శత్రువు లు ఆకాశమార్గం

ద్వారా వచ్చి చెరువు  నీటిలో విషం కలిపే ముప్పును తప్పించుకుంటారు .

అమెరికా సుప్రీమ్ కోర్టు జోక్యం తో చాలా మంది { = అభియోగాలు మోపి విచారణ జరప వలసిన అవసరం లేని }  జపానీయులను జైళ్ల నుండి  వదిలి వేశారు . మేజర్లు  అయినా జపాన్ కుర్రకారుని ఏమి చేసుకోవాలి ?అన్న ప్రశ్నకు సమాధానముగా -   జపనీయులని అమెరికా మిలటరీలోకి మాత్రం  తీసుకో వద్దు  అనే ఆర్డర్స్ వచ్చాయి   . 1943, నుండీ  "జపనీస్ అమెరికన్స్"  ని  కూడా అమెరికా సైన్యములో చేర్చుకో వచ్చు అన్న  ఆర్డర్స్   వచ్చాయి . దాదాపు  20,000 మంది "జపనీస్  అమెరికన్స్" అమెరికా మిలటరీలో చేరారు .  "జపనీస్ అమెరికను" సైనికులను ఎదుర్కో వలసి వచ్చినపుడు,  జపాను సైనికులు  ఒక సెంటి మెంటుకు లోను అయి యుద్ధము లో మెతక పడతారు అన్నది  అమెరికా వ్యూహ . ఇలాంటి హ్యూమన్ షీల్డ్  ను ఏర్పరచటం  బట్టి చూస్తే,  తాను జపాను మీద 100% విజేతను అవుతాను అనే నమ్మకం అమెరికాకి ఉండీ లేనట్లు వున్నది  అనాలి .

ఇహ   హవాయి ద్వీపంలో కూడా జపాను వారు వున్నారు కాబట్టి అక్కడ కూడా మిలిటరీ పాలన ప్రవేశ పెట్టి అక్కడ నివసించే జపాను వారిని కూడా కట్టడి చేసారు .

ఏదిఏట్లా వున్నా, జపాను వారు తమపూర్వపు చెక్రవర్తి అయిన  మెజీ తమకు  చూపిన మార్గంలోనే పురోగమించాలని ,తమ సంస్కృతీ సంప్రదాయాలను కాపాడుకుంటూ నే  ప్రపంచములో ఒక  ముఖ్య  శెక్తి గా ఎదగాలని , అందుకోసం అని అమెరికాతో యుద్ధము కొనసాగించ వలసినదే అనే ధృడ  నిర్ణయం తీసుకొన్నారు . అందు వల్ల జపాను వారు అమెరికా తో ఏ శాంతి ఒప్పందాన్నీ ప్రతిపాదించలేదు .

April 11, 1945, న Franklin D. రూసవేల్ట్ మరణించాడు . April 12 - 1945 నుండీ 1953  వరకూ Harry S. ట్రూమాన్. అమెరికా కి ప్రెసిడెంట్ఈ అయినాడు .ఈయనను "The buck stops  here" ప్రెసిడెంట్ అంటారు . కారణం ఈయన  "The buck stops  here  "  అనే మాటలు ఉన్న ఫలకాన్ని తన బల్ల మీద ఉంచుకునే వాడు .   buck అనగా దుప్పి, నా

వద్దకు వచ్చి ఆగిన దుప్పిని { సమస్యను } నేను వదిలేస్తే వదిలేస్తాను లేదా చంపి పారేస్తాను . దేనికైనా నాదే భాధ్యత " అనే ఆలోచనలో వుండే ప్రెసిడెంట్ ఈయన గారు అని అర్ధము . జపాన్ మీద అటామిక్ బాంబు వేయాలన్న ప్రతిపాదన President Trumanవద్దకు వచ్చి ఆగింది .అనగా జపాన్ అనే దుప్పి అయన ముందు నిలిచింది . జపాన్ని వదిలేయటమా చంపేయటమా ?

ఎదో మామూలు పెద్ద బాంబువేయటానికి బదులు ఆటం బాంబే వేయాలన్న ఆలోచన అమెరికాకి వచ్చింది? అని ప్రశ్నించుకుంటే .President Truman కి "నో నాన్సెన్స్ థింకర్" అని కూడా పేరు కూడా వున్నది . యుద్దములో అమెరికా సైనికులు అధికంగా మరణిస్తూ వున్నారు కాబట్టి యుద్ధము త్వరితంగా ముగించాలి , ముగించాలి అంటే ఆటం బాంబు పడాలి - దీనికన్నా ఎక్కువ ఆలోచన అనవసరం అనేది President Truman పైఖరి . ఈ బాంబు వేయటం గురించి అమెరికా అధికారులలో ఇతర ఆలోచనలు ఎమన్నా ఉంటే అవిఅన్నీ నాన్సెన్స్ ఆలోచనలే అయ్యాయి .

ఇంకొకటి ఏమిటంటే-- రష్యా మరియూ - జపానులు కూడా శత్రువులే . ఒక వేళా ఇదే అదను అని రష్యా వెళ్లి జపాను పై దాడి చేసి జపానును ఆక్ర మించు కుంటుందేమో అనే భయము Truman కి వున్నది . ఒక వేళా రష్యా కనుక జపానుపై దాడి చేసి దానిని ఆక్రమించుకుంటే జపానును కట్టడి చేయటానికి ఉద్దేశించి, అమెరికా ఇప్పటి వరకూ చేసిన మిలిటరీ ఏర్పాట్లు అన్నీ బూడిదలో పోసిన పన్నీరు అవుతాయి కదా ? అందుకని త్వరపడి , తొందర తొందరగా వెళ్లి జపాన్ పై ఆటం బాంబు వేయకుండాఆలోచిస్తూ కూచోటం కూడా ఓ నాన్సెన్స్ ఆలోచన అయ్యింది . ఇన్ని రకాలుగా మానసిక రంగాలు సిద్ధము అయినాక జపాను మీద మొదటి ఆటం బాంబు పడింది .

రచన సేకరణ వివరణ వారణాసి శ్రీ రామ కిష్ణ అమరావతి



Franklin D. Roosevelt




**Harry S. Truman**
president of United States

జపాను చరిత్ర క్లుప్తంగా {11} 13-04-24
26 July 1945 na అమెరికా "potsdam డిక్లరేషన్" అనే ప్రకటన విడుదల చేసి జపాను తనకు బేషరతుగా లొంగి పోవాలని డిమాండ్ చేసింది . జపాను తిరస్కరించింది . August 3, 1945 న అమెరికా ప్రెసిడెంట్ జపాన్ మీద ఆటామిక్ బాంబు వేయటానికి అనుమతి ఇచ్చాడు . August 6, 1945 న లిటిల్ బాయ్ అనే ముద్దు పేరువున్న ఆటం బాంబును జపాన్ లోని హిరోషిమా మీద వేశారు. Hiroshima అన్నది ఆర్థిక పరంగానూ మిలిటరీ

పరంగానూ  జపానుకు ఎంతో ముఖ్య మైనది కాబట్టి దాని మీద బాంబు వేశారు. అప్పుడు 129,000 మంది జపనీయులు ఎక్కువుగా పౌర  జనం మరణించారు.
"బాంబు పడినాగానీ జపాను సంధికి రాలేదు" అనుకుంటూ  August -09 - 1945  న మరొక బాంబును నాగాసాకీ మీద వేశారు .ఈ బాంబు పేరు ఫాట్ మ్యాన్ .
కేవలం జపాన్ మిలటరీ స్థావరాల మీదనే  బాంబులు వేస్తే జపాన్ లొంగి రాదేమో ? కాబట్టి జనావాసాలు ఎక్కువ వున్నా నాగసాకి మీద బాంబు వేసి జపాన్ ప్రజల ఆత్మ స్త్యైర్యము దెబ్బ తీద్దాము  అన్న ఉద్దేశముతో  President Truman నాగసాకి మీద బాంబు వేయమన్నాడు .
ఆయన ఆశించినట్లే   ఈ  దాడిలో   226,000 జపనీయులు  మరణించారు .
జపాను తో పాటు జెర్మనీ మీద కూడా ఎందుకు బాంబు పడలేదు అని ఆలోచిస్తే- జెర్మనీలో ఒక అణు బాంబు వేయతగ్గ గొప్ప ప్రదేశము  ఏదీ కూడా అమెరికాకి  కనపడ లేదు .  తాను  వేసే  బాంబు మీద పెట్టిన ఖర్చుకు తగినంత నష్టము శత్రుదేశము పొందుతుందా లేదా అనేది కూడా యుద్ధ సమయాలలో ఆలోచిస్తారు.  లక్షల విలువచేసే బాంబు వేసి వేల  రూపాయల ఆస్తిని ధ్వంసం చేయటం ఏమితెలివి  ? అలా అన్నమాట  ?

August 3, 1945 న జపాన్ మీద అటామిక్ బాంబు పడగా 7 August 1945 న రష్యా కూడా జపానుతో యుద్ధము ప్రకటించింది . ఇహ జపానుకు లొంగి పోక తప్పలేదు. 15 August,1945 న జపాను- అమెరికాకి లొంగి పోయింది. .

“ ప్రజల మనో స్థైర్యాన్ని పెంచుటకు ,జపనీయులు శాంతిని కోరు వారు అన్న సహజ కీర్తికి లోపం రాకుండా ఉండేటందులకు ,జరిగిన పరిణామములు రూపు మాసి పోయి ప్రపంచ శాంతి చేకూరుటకు, జపాను కూడా ఈ ప్రపంచము తో కలిసి అడుగులు వేయుటకు - నైతికంగా ఇదియే సరి ఐనది అని మేము పెంచి పోషించుకున్న నిర్ణయముతో { అంటే దీనిలోని తప్పు ఒప్పులకు నాదే బాధ్యత అని తెలియ పరుస్తూ వున్నాడు } , మేము శాంతి ఒప్పందం చేసుకుంటూ వున్నాము అని " జపాన్ చక్రవర్తి Hirohito's - ఒక రేడియో ప్రకటన ద్వారా ప్రజలకు తెలియ పరిచాడు . ప్రకటన మొదట ఆంగ్లం లోను ఆ వెనువెంటనే జపాను భాషలో ప్రసారం అయ్యింది . లొంగు బాటు అంటే శత్రువు యొక్క భాషను ముందుగా పలకటం కూడా అవుతుంది అని మనము గ్రహించాలి .
"ఇంకా ఎవరూ నశించి పోగూడదు . సంస్కృతులు నాశనం ఐ పోరాదు --ఇంతటి దురదృష్టము మరింతగా రాకూడదు

--   మేము సహింపరానిది సహించాము  " అని చక్రవర్తి తన అనుమాయిలతో అన్నాడు .

యుద్ధము ముగిసే సరికి రష్యా  Bulgaria, Romania, Hungary, Poland and eastern Germany. ని తన ఆధీనంలోకి తీసుకుంది . Great Britain, the United States, France,  మిగతా జర్మనీని తమ ఆధీనంలోకి తీసుకున్నాయి .

కొరియా లో వున్నా జపాను సైన్యాన్ని తొలగించే ఉద్దేశ్యముతో అమెరికా రష్యా  కొరియాను రెండుగా విడదీసాయి . చివరికి వీరి ఇద్దరి కారణంగానే కొరియా నేటికీ ఏకం కాలేక పోయింది .

రష్యా  అమెరికాలు జెర్మనీని, కోరియానీ   చెరిసగం చేసి పంచుకున్నాయి కదా ? మరి జపానును ఎందుకు పంచుకోలేదు ? ఎందుకంటే ఆటం బాంబు వున్న అమెరికాని  చూసి  రష్యా కూడా వెనక్కి తగ్గింది  . కానీ ఈ రెండో ప్రపంచ యుధమునుండే రష్యా తానుకూడా ఒక అణు  శక్తిగా ఎదగాలి అని నిర్ణయించుకుంది  . ఇంకొక కారణం,   1941 నుండీ  1945  వరకూ మొత్తము 11.3 బిల్లియన్ డాలర్ల యుద్ధ సహాయాన్ని అమెరికా రష్యాకి

అందించింది . అందువల్ల కూడా రష్యా జపానులో భాగము అడగలేదు .

జపాను తనకు లొంగి పోగానే అమెరికా జపానులో వున్నా సైన్యాన్ని కంట్రోల్ లోకి తీసుకుంది . చెక్రవర్తి హిరోహితో కూడా సామ్రాజ్య విస్తరణ కాంక్ష కలవాడే అన్న ఆలోచనతో- అమెరికా జపాను చక్రవర్తి వంశ పారంపర్య పాలనకు మంగళం పాడాను అంటూ కొన్ని రూల్సు తెచ్చింది . జపానుకు చెందిన అనేక వ్యవస్థలను రద్దు చేసింది . మిలిటరీకి అనుసంధానమైన పరిశ్రమలను కూల్చి వేసింది . జపాను లో వున్న షింటో మత వ్యవస్థను కూడా రద్దు చేసింది . షింటో మతము చెప్పే మాటలు సిద్ధాంతాలు - జపాను ప్రజలలో చక్రవర్తి పట్ల భక్తిని-- జపాను సైన్యంలో చక్రవర్తి పట్ల లాయాలిటీ ని -ప్రేరేపించు తాయి అన్న భయంతో - అమెరికా షింటో మతాన్ని రద్దు చేసింది. చెక్రవర్తి నేరుగా దేముని యొక్క సంతానము అనటాన్ని కూడా నిషేదించింది . ఈ పరిస్థితిని బట్టి షింటో మతము జపానులో ఎంత ప్రభావము వహించిందో కూడా ఊహించవచ్చు . షింటో మందిరాలకు గతంలో జపాను ప్రభుత్వము ఇస్తో వున్న నిధులను కూడా అమెరికా వారు నిలిపి వేశారు.ఇదంతా క్రిస్టియానిటీని రంగంలోకి దింపటానికేనా?

అంతకు మునుపే జపానుకు వచ్చిన  విదేశీయులతో పాటు జపానులోకి  "ప్రొటెస్టెంట్"క్రిస్టియానిటీ "జపాను లోకి ప్రవేశించింది   { =కేవలం క్రీస్తును మాత్రమే నమ్మండి - పొప్ లాంటి వారే  రాను  అవసరం లేదు..మనలో ఎవరము అయినా క్రీస్తు ను గురించి భోదించ వచ్చు   అని చెప్పే శాఖ . అందువల్ల వీరిలో ని ఎవరైనా సరే క్రీస్తుని గురించి భోదించి మత విస్తరణ చేస్తారు  }   .
అమెరికా జపాను శాంతి ఒప్పందం తరువాత Evangelical క్రిస్టియన్లు  "ప్రొటెస్టెంట్ క్రిస్టియానిటీ " ని వెనక్కి నెట్టి,   పలు రేట్ల వేగంతో ముందుకు దూసుకెళ్ల గలిగారు .  {Evangelicals = take the Bible seriously and believe in Jesus Christ as Savior and Lord.}  . యుద్ధము పేరున తప్పు  చేసిన జపనీయులను యేసుక్రీస్తు ద్వారా క్షమించటానికే తాము వచ్చాము అంటూ వీరు ప్రచారం చేసుకొని ముందుకు దూసుకెళ్ల గలిగారు .
"యుద్ధము చేసి మీరు తప్పు చేశారు"  - అనే భావాన్ని -- అమెరికా  జపనీయులలో చొప్పించ దలచింది  . నేను ఏ తప్పు చేయలేదు అన్నవాడు తిరగ బడే అవకాశం వున్నది కదా ? అందువల్ల ఈ బోధలు .   Hirohito చక్రవర్తి ఏ కదా అమెరికాతో  శాంతి ఒప్పందం చేసుకున్నది

? అందువల్ల ఆ చక్రవర్తి మీద గౌరవము కొద్దీ జపనీయులు క్రీస్టియానిటీని సహించారు .
7, 1989. న హిరోహితో చక్రవర్తి మరణించగానే జపానులో క్రిస్టియానిటీ పొంగు తగ్గింది . నేటి జపానులో 1.5% మంది మాత్రమే క్రిస్టియన్లు  వున్నారు . షింటోలు 70 % బౌద్ధులు 67 % వున్నారు . విచిత్రము ఏమిటంటే జపనీయులలో చాలా మంది  క్రిస్టియానిటీ మతాచారాలు పాటించకుండానే - క్రిస్టియన్ పద్ధతి ని అనుకరిస్తూ  పెళ్లిని ,  వేడుకలను చేసుకుంటారు .  అందువల్ల జపాను లోని ఒక పెళ్లి వీడియో మనము చూసినపుడు - అక్కడ  ఎంతో క్రిస్టియానిటీ ఉందని మనకు భ్రమ కలుగుతూ  ఉంటుంది .

జపాను చరిత్ర క్లుప్తంగా {12}

అణు బాంబుద్వారా  అమెరికా  జపానును ఆక్రమించుకున్నది . జనాల మీద  దాష్టికాలకు మాత్రం దిగలేదు. మామూలు ప్రజలను శత్రువులుగా   చేసుకో రాదని అమెరికా ఇంతకుముందే అనుభవ పూర్వకంగా నేర్చుకొని వుంది .  జపనీయులు తమ చెక్రవర్తిని అమితంగా ప్రేమిస్తారు . అందువల్ల   జపాను చెక్రవర్తిని గౌరవంగా చూసుకుంది . అమెరికా సాయంత్రం పూట బాంబులు వేసి మరునాడు ఉదయము చంటి పిల్లల కోసం

పాల డబ్బాలు పంపిణీ చేస్తుంది అనే నానుడి వున్నది .
ఆటం బాంబు తరువాత -- అమెరికా -- జపానుకు 22,250 టన్నుల గోధుమ పిండిని పంపించి ప్రతి పౌరుడికీ ప్రతి రోజుకి 297 గ్రాములు చొప్పున పంపిణీ చేసింది .
జపనీయులు దీనిని రామేన్ అనగా నూడిల్సు లాగా చేసుకొని - అట్టు లాగా పోసుకొని తిన్నారు .
జపాను ప్రజలు గుమ్మడికాయ ను ఒక ఊరగాయ లాగా మార్చి నిల్వ పెట్టుకునే అలవాటు వుంది . మన ఇంట్లో ఆవకాయలాగా ప్రతి ఇంటిలోనూ ఉంటుంది . దీనిని కూరగా మరియూ సూప్ గా తిన్నారు . జపనీసు భాషలో గుమ్మడి కాయను (Kabocha: かぼちゃ) అంటారు .
యుద్ధము తరువాత ఇది "SAVOR JAPAN " అనే పేరుతో గౌరవం పొందింది .
ఆటం బాంబుల కన్నా ముందు, జపాన్ మీద మామూలు బాంబులు కూడా పడి ఉంటాయి కదా? అందువల్ల జపాను మొత్తము చెత్త కుప్ప లా మారింది . ఇంతే కాక యుద్ధము చేయటానికి అని జపాను సేకరించుకున్న యుద్ధ సామాగ్రి ఐన బాంబులు - తూటాలువంటివి రెండు మిలియన్ టన్నుల వరకూ ఇంకా అట్లాగే పడి వున్నవి .
జపానును నిరాయుధీకరించటం లో భాగంగా వీటినన్నిటిని తీసుకెళ్లి సముద్రములో పారేయించాల్సి వచ్చింది .
అందువల్ల అమెరికా, హిరోషిమాలో తన పాలనా కేంద్రాన్ని

ఏర్పాటు చేసి , ఆ చెత్తను తొలగించే పనిలోకి జపాను వారినే పనిలోకి తీసుకుంది.  ఈ రకంగా అమెరికా జపానును   పునర్ నిర్మించటం మొదలు పెట్టింది . అమెరికా తరఫున వచ్చిన  , General Douglas A. MacArthur, 1945 -- 1952 మధ్య అనేక  military, political, economic, and social సంస్కరణలు ప్రవేశపెట్టాడు.  అప్పుడు డు అమెరికా లక్ష్యం ఒక్కటే . ఇక భవిష్యత్తులో ఎప్పుడూ కూడా జపానువారు  అమెరికా మీద ప్రతీకార దాడులకు దిగకుండా చూడటం .దీని కోసం అని అమెరికా వారి ఆధ్వర్యంలో జపాను రాజ్యాంగాన్ని తిరగ రాసారు . దీని ప్రకారం  May 3, 1947, నుండీ జపాను దేశము తనకు వున్న యుద్ధము చేసే హక్కును పరిత్యజించింది .   జపాన్ రాజ్యాంగంలోని Article 9 ప్రకారము జపాన్ కి ఆర్మీ , నేవీ,  ఎయిర్,  ఫోర్స్ బలగాలు వుండవు . ఇకముందు ఏవన్నా యుద్ధాలు జరిగితే, జపాన్ ఆ యుద్ధాలలోకి దిగటానికి వీలు లేకుండా ఇట్లా కట్టు బాట్లు   చేశారు . మరి జపానును ఎవరు కాపాడుతారు ? అంటే  జపాను రాజ్యాంగము లోని Article 5 ప్రకారము " పరాయి దేశాల వారు  ఎవరన్నా వచ్చి జపాను మీద దాడిచేస్తే వారి సంగతి అమెరికానే చూసుకుంటుంది . అంటే జపాను యుద్ధాలు చేయకూడదు .  జపాన్ తరఫున   అమెరికానే యుద్ధాలు చేస్తుంది . దీని

కోసమని -- Article 6 ప్రకారము జపానులో తన సైనిక స్థావరాలను ఏర్పాటు చేసుకోవటానికి ప్రత్యేక హక్కులు వచ్చాయి .

1954 లో The Japan Self-Defense Forces (JSDF) అనేది ఏర్పాటు అయ్యింది . ఇది తనకు తానుగా యుద్ధాలు చేయదు . జపాను భూ భాగాన్ని ఆక్రమించుకోవాలని వచ్చే వారి ని ఎదిరించి చేసి దేశాన్ని రక్షిస్తుంది. ఈ రకంగా

రెండో ప్రపంచ యుద్ధములో అమెరికాకి ఎదురు నిలిచిన జపాను యుద్ధ శక్తి - చివరికి కోరలు తీసిన పులిగా మారింది . అమెరికా చేతిలో అణుబాంబు లేకపోతే ఎలాగుండేదో ఏమిటో ?

జపాను మీద ఆటం బాంబ్ వేసినది అమెరికా కాబట్టి -- ఈ విజయము అమెరికాకి దక్కాలి కదా ? కానీ అమెరికా ఉద్దేశ్య పూర్వకంగా నే అవిజయము " అల్లైడ్ ఫోర్సెస్" వారిది అన్నది . అందువల్ల -- "జపాను" నా రాజ్యము అని అమెరికా అనలేదు - నేను మీ రాజ్యాన్ని అని జపానూ అనలేదు . .జపాను అనేక ద్వీపాల సమూహము. కొన్ని ద్వీపాలు మిలటరీ పరంగా రష్యాకు అమెరికాకు కూడా సరి సమానంగా అవసరమైనవి . ఈ పంపకం లో తేడాలు తలెత్తి, రష్యా తన మీద యుద్ధానికి వస్తే ,ఆ యుద్ధము కూడా చేయటానికి అమెరికా దెగ్గర

చాలినంత ఓపిక లేక పోయింది. .-- అమెరికా చేతిలో వున్నా అణ్వాయుధాన్ని చూసి అమెరికా కి మిత్రులు జపానులో వాటా కోరకుండా వెనక్కి తగ్గారు .
యునైటెడ్ నేషన్స్ ఆధ్వర్యములో "అల్లైడ్ ఫోర్సెస్" 08 September 1951, న, జపానుతో " దీశాన్ఫ్రాన్సిస్కో ఒప్పదం" అనే ఒప్పందం కుదుర్చుకున్నాయి . .28 April 1952. నుండి ఇది అమలులోకి వచ్చింది . దీనిప్రకారం జపానును సర్వసత్తాక ,స్వతంత్ర దేశంగా గుర్తించారు . ఇదే రోజున అనగా 8 September 1951 న కేవలము అమెరికా జపాన్ ల మధ్య మరో రక్షణ ఒప్పందం కుదిరింది . ఈ ఒప్పందంలో జపాను అమెరికాతో ఎలా మసులుకోవాలో నిర్ణయించారు . ఈ ఒప్పందం అనుసరించి , జపానులో అమెరికా తన మిలటరీ స్థావరాలను కొనసాగిస్తూ నే ఉంటుంది . అమెరికాకి తప్ప మరే దేశానికి కూడా జపాను లో మిలటరీ స్థావరాలు పెట్టుకునేందుకు జపాను ప్రభుత్వాలు అనుమతి ఇవ్వ కూడదు .
28 April 1952, నుండీ అమెరికా జపానును తన ఆక్రమణ నుండి వదిలి వేసింది . జపాను సర్వసత్తాక దేశము అయ్యింది . కానీ రెండో ప్రపంచ యుద్ధానికి ముందు తాను గెలుచుకున్న . Korea ని .,అనేక చిన్న చిన్న దీవులను కూడా కోల్పోయింది .

.

February 11 ను National Foundation Day ఉత్సవాలు జరుపుతారు .

..



పై వున్నది లిటిల్ బాయ్ అనే పేరుగల అమెరికన్ ఆటం బాంబు



పై వున్నది ఫ్యాట్  మాన్    అనే పేరుగల అమెరికన్ ఆటం బాంబు



Above photo isKabocha: యుద్ధము తరువాత ఇది "SAVOR  JAPAN " అనే పేరుతో గౌరవం పొందింది .

జపాను గురించి ఎన్నో విషయాలు వున్నాయి అవి తరువాత చెపుతాను .



ఈ ఫోటో జపాను బాలుడిది . రొండో ప్రపంచ యుద్ధములో తల్లి తమ్ముడు మరణించగా - తమ్ము డి మృత దేహాన్ని మోసుకుంటూ స్మశాన వాటికకు చేరిన బాలుని ఫోటో ఇది . యుద్ధ సమయాలలో

మిలిటరీ వారే యుద్ధ దృశ్యాలని ఫోటో లు తీయిస్తూ వుంటారు . ఇది వారి కెమెరా కంటికి చిక్కిన దృశ్యము .
ధైర్య సాహసాలకు గుర్తుగా మనము నేతాజీని ఎలా సంస్మరించు కుంటామో - అదేవిధంగా హెరోషిమా మరియూ నాగసాకి మీద బాంబు పడిన విషయాన్ని జపాను వారు స్మరించుకునేటపుడు-- జపాను గుండెనిబ్బరానికి సూచనగా ఈ పిల్ల వాడి ఫోటోని ప్రతి టీవీ లోనూ చూపిస్తారు . ఇతని గురించి కధనాలు ప్రసారం చేస్తారు .
ఈ పిల్లవాడు తన తమ్ముని మృత దేహాన్ని వంటికి కట్టుకున్న తీరుని బట్టి - అతడు తన స్కూల్ బ్యాగ్లో పెట్టి తన తమ్ముడిని తీసుకు వచ్చాడని భావిస్తారు . చెప్పులు సాక్స్ లేకపోవటంవల్ల ఇతడు తమ్ముని కి గౌరవార్ధము వాటిని ఇంటిలోనే వదిలేసి మరీ మోసుకు వచ్చాడు అని చెపుతారు ,
ఆటం బాంబుకు లొంగనిది ఏదన్న వున్నది అంటే అది ఆత్మ స్థైర్యమే అని ఈ పిల్లవాడు చెబుతున్నాడా ? అనిపిస్తుంది .ఇతను బడి నుండి రాగానే తన కర్తవ్యము ఏమిటో దాన్ని గ్రహించి - దాన్ని ఆత్మ స్థైర్యముతో భుజానికి ఎత్తుకున్నాడు

జపాను గురించి క్లుప్తంగా అన్నది ఇక్కడికి సమాప్తము .



రచన సేకరణ వివరణ వారణాసి శ్రీ రామ కిష్ణ అమరావతి-